## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020010004523



**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

Subject

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

Language

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# బ్రహ్మంగారి నాటకం

గ్రంథకర్త:

కీ॥ శే॥ కడియాల వీపూరయాచార్యులుగారు



కాలజ్ఞాన ప్రచారకులు : శ్రీ వంకాయలపాటి నాగభూషణాచార్యులుగారు


రఘు బుక్ షాప్, తెనాలి.

ప్రొప్రయిటర్స్ : దుడ్డు కోటేశ్వరరావు అండ్ సన్స్

## ఈ నాటకమున వచ్చు పాత్రలు

**పురుషులు:**

1. యేకాంబరయోగి
2. బ్రహ్మంగారు
3. సిద్ధుడు
4. గోవిందయ్య
5. పోతులూరయ్య
6. పీరుసాహెబు
7. హాస్యగాడు
8. సేవకుడు

**స్త్రీలు**

1. గోవిందమ్మ
2. ఈశ్వరమ్మ
3. ఆదంబీబి

---

సందర్భానుసారముగా మరికొందరు వచ్చెదరు.

శ్రీ ర స్తు

# శ్రీ పోతులూరి వీర బ్రహ్మంగారి నాటకము

## విరాట్ స్తోత్రము

శంఖం చక్రగదా ప్రభయాంచితకరాన్. సల్లేఖిసిం రక్షిణే
ఫక్కాశూలకమండలుంచవరదం వామేతిపుస్తం తథా
బ్రహ్మశాచ్యుత చక్రభానుపిశరం, పంచాస్య మార్తావనం
విశ్వాస్తవ్య మనంత మవ్యయమనాద్యం. విశ్వకర్మం, భజే.

శా॥ శ్రీమద్భక్త చకోరచంద్ర, సురరాట్స్వామిశ్ర ప్రాభవో
ద్దామానాంత, విరాట్ స్వరూప, సకల త్వాతీతజ్ఞాన ప్రధా
వ్యోమాతీత నిరంజనా ! నిరుపమా నోఽవ్యక్తాఖాతీత ! నిన్
వేమారుల్ మదిలోఁదలంచెదను శ్రీ విశ్వేశ్వరా ! సర్వదా.

### బ్రహ్మంగారిస్తోత్రం

గీ॥ భక్తి చేతులుజోడించి పాహి లోక
పూజితా ! యంచు శ్రీవిరాట్ పోతులూరి
వీర నారాయణా ! నినువేడువాడ
కరుణతో నన్ను నిరతంబు గావుమయ్య !

### మనుబ్రహ్మ స్తోత్రం

శా॥ ఆద్యుండై పరతత్వరూపమున బ్రహ్మాండంబు సృష్టింపఁగా
నవ్యక్తంబుగ లోహపంచకము దానుత్పత్తి గావించియున్
భేద్యంబెంతయుగాక సంతతము ఋగ్వేదంబు పాఠకంబుగా
సద్యోజాతముఖాంబుజా మనువు నుత్సాహంబునన్ గొల్చెదన్

### మయబ్రహ్మ స్తోత్రం

ఉ॥ భూరి సమస్తదిక్కులకు బొల్పులుగూర్చ ధరాస్థలిన్, మహా
ధీరత నుద్ధరింపగను దివ్యతరోన్నతశక్తి నెన్నిమో
దారుమయైక చిత్రముల దానొనరించియు జక్రహస్తుడై
కూరిమినింపు మాయయుని కోరి భజించెద నిష్టసిద్ధికై.

### త్వష్టబ్రహ్మ స్తోత్రం

ఉ॥ పూర్వులులేక పిండములు చోద్యముగా గనజాలవంచు కేత్
రూపుల జేయుచో సురగురుండను విరించియు నానావేదము

దీపనమొప్పగా నుడువు దివ్యకళా పరిపూర్ణు త్వష్టు, నా
ప్రాపని నమ్మి గొల్చెద, శుభస్థితులియ్య, సహస్రశంబులన్.

శిల్పిబ్రహ్మ స్తోత్రం

ఉ॥ దేవ మహాస్వరూపముల దివ్య మహాస్థల యంత్రసంగత
స్థావర సారశిల్ప ఘనశాస్త్ర సముంచిత సత్ క్రియాచణో
ద్భావవిరాజి, తత్పురుష భాసితుడౌచు నశిల్పశాస్త్రసంతతి
శ్రీ విరసిల్లు శిల్పి విధుజిత్తముగన్ స్మరియింతు భక్తితోన్.

మౌనబ్రహ్మ స్తోత్రం

చ॥ సురనికరంబు వేడగదు చోద్యమెంచర్ప సువర్ణరత్న వి
స్ఫురిత మహోన్నతాభరణ సుందరసృష్టి సమగ్రభావ సు
స్థిర విభవోన్నతిన్ దెలుపు శ్రీమనఖండిల తేజసత్వ సంభ
భరితు, వసంతరూపు దయివజ్ఞుదలంతు నభీష్టసిద్ధికిన్.

విఘ్నేశ్వర ప్రార్థన

శా॥ విఘ్నధ్వాంతమునెల్ల బాపరవియై, విఘ్నాహిరాట్ తార్క్ష్యుడై
విఘ్నాభ్రప్రళయానిల ప్రధితుడై, విఘ్నాబ్జసుభ్రాంశుడై
విఘ్నోత్తుంగ గిరీంద్ర వజ్రనిభుడై విఘ్నేశ్వర ఖ్యాతితో
విఘ్నారణ్య దవానలుండయిన యా విశ్వేశ్వరుం గొల్చెదన్.

సరస్వతీ ప్రార్థన

చ॥ కులుకు మిటారిగబ్బి చనుగుబ్బల పైగల హేమరత్న సం
విలసిత మౌక్తికావళులు విభ్రమకాంతి నెసంగ, సల్లమ్మగం
బుల దొరతోడి క్రీడదగు భోగవిహార విలాసవాణియా
పలుగువెలంది మా కొసగుభావ్య చమత్కృతి సంతతంబునున్.

అంబా ప్రార్థన – దరువు

1. అంబా ! నమః కాళికాంబా ! నమో, శివ
శంభునిరాణీ ? మదంబా ! నమో – జగదంబా నమో॥

2. కంబుకంధర గౌరి, కౌమారి, శాంకరి
అంభోజ నేత్రి ! జగదంబా నమో ! అంబా నమో॥

3. కాళి, మహాదనుజాళి, నిర్జిత రణ
కేళీ, దుర్గా, మహాకాళీ, నమో – అంబా నమో

4. కంకణ ఝుణఝుణ కింకిణీ రవహారీ
శాంకరీ, ఓంకార, శక్తి నమో - అంబా నమో
5. కందిమల్లయపుర, మందున వెలసిన
సుందరేశ్వరి దేవి శుభదే ? నమో, జగదంబా నమో॥
వ॥ అని యిష్టదేవతాభి వందనాము లొనరించి, సద్గురుధ్యాన పురస్సరంబుగా నొక్క పుణ్యపురుషుని సత్కథాప్రభావంబు వివరింప దలంచుపట్టున నొకింత మద్వంశావతారంబభి వర్ణించెద.

వంశావళి

ఉ॥ శ్రీయుత విశ్వకర్మ కులసింధు సుధాకరమూర్తి, సాధు చిచ్ఛ్రీయుఁడనేక శాస్త్ర పరిశీలుడు సత్కడియాలనామ వంశాయత మల్లయాఖ్యుడగు నాతనికిన్ మహాలక్ష్మియందు పద్మాయతనేత్రి కాళి వరమంది జనించితి ధారుణీస్థలిన్.

కం॥ శ్రీ పరమేశ్వర నద్నాం
త్రోపాసక శీలుడనయి యొప్పెడివాడన్
నా పేరు నుగ్గడింతురు
వీపూర్వాచార్యుడంచు విద్యావంతుల్.

గ్రంధకర్త ప్రోత్సాహకుల దెలుపుట

సీ॥ శ్రీ విశ్వకర్మ వంశీయుడు కాశ్యప
గోత్రుండు దామను సూత్రుడైన
ఆచార్యనకు పుల్లమాంబకు గొమరుడు
గురులింగ యాచారి, పరమసాధ్వి
యగు సుబ్బమాంబ సుతాగ్రణీ పరమి
వీరాచారి యనుపేరు నలరుచుండి
భాసురమైన సుభాయిలాకా 'గని
యాత్మకూ' రను పురమందు నుండి
వసుధ గృష్ణానదీతీర వాసుడనగ
బుధజనావళి లోపల పూజ్యుడయ్యు
శ్రీ విరాట్ పోతులూరి విశేష భక్తి
పాత్రుడన మించె సజ్జనభావమందు

దీపనమొప్పగా నుడువు శిల్పకళా పరిపూర్ణ తేజస్సు, నా
ప్రాపని నమ్మికొల్చెద, శుభస్థితులెయు, సహస్రశంబులన్.

శిల్పిబ్రహ్మ స్తోత్రం

ఉ॥ దేవ మహాస్వరూపముల దివ్య సుహాస్థల యంత్రసంగత
స్థావర సారశిల్ప ఘనశాస్త్ర సమంచిత సత్ క్రియాచణో
ద్భావవిరాజ, తత్పురుష భాసితుడౌచు నథర్వణశ్రుతి
శ్రీ విరసిల్లు శిల్పి విభుజిత్తమునన్ స్మరియింతు భక్తితోన్.

త్వష్టబ్రహ్మ స్తోత్రం

చ॥ సురనికరంబు వేడఁగడు చోద్యమొనర్ప సువర్ణరత్న వి
స్ఫురిత మహోన్నతాభరణ సుందరసృష్టి సమగ్రభాన సు
స్థిర విభవోన్నతిన్ దెలుపు శ్రీమదఖండల తేజ నిత్య సంభ
భరితు, వసంతరూపు దయివజ్ఞుఁదలంతు నభీష్టసిద్ధికిన్.

విఘ్నేశ్వర ప్రార్థన

శా॥ విఘ్నధ్వాంతమునెల్ల బాపరవియై, విఘ్నాహిరాట్ తార్క్ష్యుడై
విఘ్నాభ్రప్రళయానిల ప్రధితుడై, విఘ్నాబ్జసుభ్రాంశుడై
విఘ్నోత్తుంగ గిరీంద్ర వజ్రనిభుడై విఘ్నేశ్వర ఖ్యాతితో
విఘ్నారణ్య దవానలుఁడయిన యా విఘ్నేశ్వరుం గొల్చెదన్.

సరస్వతీ ప్రార్థన

చ॥ కులుకు మిటారిగబ్బి చనుగుబ్బల పైగల హేమరత్న నం
విలసిత మౌక్తికావళులు విభ్రమకాంతి నెసంగ, సల్మాగం
బుల దొరతోడి క్రీడదగు భోగవిహార విలాసవాణియా
పలుగువెలంది మా కొసగు భావ్య చమత్కృతి సంతతంబునున్.

అంబా ప్రార్థన - దరువు

1. అంబా ! నమః కాళికాంబా ! నమో, శివ
శంభునిరాణీ ? మదంబా ! నమో - జగదంబా నమో॥
2. కంబుకంధర గౌరి, కౌమారి, శాంకరి
అంభోజ నేత్రి ! జగదంబా నమో ! అంబా నమో ॥
3. కాళి, మహాదనుజాళి, నిర్జిత రణ
కేళీ, దుర్గా, మహాకాళీ, నమో - అంబా నమో

4. కంకణ ఝణఝణ కింకిణీ రవహారి
శాంకరీ, ఓంకార, శక్తి నమో - అంబా నమో
5. కందిమల్లయపుర, మందున వెలసిన
సుందరేశ్వరి దేవి శుభదే? నమో, జగదంబా నమో॥

వ॥ అని యిష్టదేవతాభి వందనాదు లొనరించి, సద్గురుధ్యాన పురస్సరంబుగా నొక్క పుణ్యపురుషుని సత్కథాప్రభావంబు వివరింప దలంచునట్టుల నొకింత మద్వంశావతారంబభి వర్ణించెద.

వంశావళి

ఉ॥ శ్రీయుత విశ్వకర్మ కులసింధు సుధాకరమూర్తి, సాధు చి
చ్ఛ్రీయుడనేక శాస్త్ర పరిశీలుడు సత్కడియాలనామ వం
శాయత మల్లయాఖ్యుడగు నాతనికిన్ మహాలక్ష్మియందు ప
ద్మాయతనేత్రి కాళి వరమందు జనించితి ధారుణీస్థలిన్.

కం॥ శ్రీ పరమేశ్వర నామం
త్రోపాసక శీలుడనయి యొప్పెడివాడన్
నా పేరు నుగ్గడింతురు
వీపూర్వాచార్యుడంచు విద్యావంతుల్.

గ్రంథకర్త ప్రోత్సాహకుల తెలుపుట

సీ॥ శ్రీ విశ్వకర్మ వంశీయుడు కాశ్యప
గోత్రుండు దామను సూత్రుడైన
ఆచార్యునకు పుల్లమాంబకు గొమరుడు
గురులింగయాచారి. పరమసాధ్వి
యగు సుబ్బమాంబ సుతాగ్రణీ పరమ
వీరాచారి యను పేరు వెలయుచుండి
భాసురమైన సుభాయిలాకా 'గని
యాత్మకూ' రను పురమందు నుండి
వసుధ కృష్ణానదీతీర వాసుడనగ
బుధజనావళి లోపల పూజ్యుడయ్యె
శ్రీ విరాట్ పోతులూరి విశేష భక్తి
పాత్రుడన మించె సజ్జనభావమందు

వ॥ అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన శ్రీ విరాట్
పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వాములవారి ప్రభావంబును నాటకా
లంకార సాహిత్యంబునఁ గథా ప్రారంభంబెట్టెదనిన.

సీ. శ్రీకరంబైన యీక్షితి మండలంబున
కడప జిల్లాయందు ఘనతనొప్పు
బద్వేలు తాలూక బహుళంబుగా నుండు
కందిమల్లయపల్లెయందు వెలయు
చున్న శ్రీమత్పోతులూరి వీరబ్రహ్మ
యోగీంద్రు వినుతించి యుల్లమందు
వేడుకతోడ గోవిందమ్మను భజించి
యాశ్వాచనముల్ హెచ్చుగాను
నామదిని నమ్మి ప్రముఖ్యగా నాటకంబు
చేయబూనితి వారి యాశీస్సులంది
తునటకై మరి వినుతింతు మహిదలంతు
కోర్కెలీడేర్చుడని వేడుకొందు నెపుడు.

ఏకాంబర యోగీరాక, ద్విపద, ముఖారి రాగము

ద్విపద॥ వినరయ్య నాపూర్వ వృత్తాంతమెల్ల - జనములెల్లను
బహు శ్రద్ధాళురగుచు - గురుతుగా వినుపింతు కొన్ని సంగ
తులు - అరుదుగా నియ్యది యతిగోప్యతరము - మును జన్మమున
నేను ముదముతోడుతను - పనివడి బనగాన పల్లెలోనుండి-వీరప్ప
యాచార్యు వేడ్క సర్పించి వారికటాక్ష దృష్టానన గలిగి - తిరిగి
విచ్చేసిన దేశికస్వామి - తెరగువీడక తదా దేశంబునందె-యావీర
గురు నభయంబు వేడుచును-సేవింపుచున్నాడ చిరకాలమయ్యె-
పొందుమీరంగ నీభూలోకమునను-కంధిమల్లయపల్లెకడ నివసించి-
కాలత్రయంబుల గల్గినయట్టి-చాల కాలజ్ఞాన సందర్భములును-విప
రీతములును యీ విశ్వంబులోన - చపల మానసులను శక్తిరూప
ములు - హరియించుటాది మహాద్భుతంబులును - ధరణి వడంకుట
తల్లక్రిందౌట - అవనిలో పంచసహస్రములు - కవతరించియు
బ్రహ్మమరుదెంచుటయును-మొదలుగాగల కొన్ని ముఖ్యాంశము

స్థలమున - యాజకుండగుచు వీరాంకుడై యొప్పు - భోజయాచార్యుండు పుణ్యవ్రతుండు-విశ్వకర్మాన్వయ విఖ్యాతమూర్తి- యైశ్వర్యవంతుడై. యతి తపధ్యాన - సంపత్తి-యాధుర్య చాతుర్యుడగుచు-పెంపొంది సుజ్ఞానవృద్ధిచేయించి-అప్పనిగారు వీరప్పయ గాంచె-చెప్పినూపగరాని చిత్కళాస్ఫూర్తి-చెన్నొంది మహిత ప్రసిద్ధుడో యనగ-పన్నుగా బనగాని పల్లెను జేరి - అన్నాజి రావునకాత్మైకబోధ - మున్నుగా దెల్పి సంపూర్ణంబుగాగ - మరియు కాలజ్ఞాన మహిమలు దెల్పి - ధరణి మా యాజ్ఞను తల దాల్ప మంచు - శ్రీ విరాట్ పోతులూర్వీరాంకు డగుచు - గోవింద మాంబను గూడి తేజమున - తాను బ్రహ్మంబైన తత్వంబు దెలిపి - మానుగా నల కందిమల్లయపల్లె - మఠమందు నివసించి మాన్యతజెంది - హఠయోగ నిరత నాభ్యాససాధనల - జ్ఞానోపదేశంబు గణ్యతనొసగ - పూనిక శిష్యులు పూజింపుచుండ-భజన కీర్తనలతో భక్తి దైవార - నిజభక్తగణములు నృత్యముల్ సేయ సాంగత్యపరులెల్ల శరణని వేడ - మంగళ ప్రదములౌ మాటలాడుచును వేంచేసి బ్రహ్మంబువీధుల వెంట-సంచితంబులు బావు సద్గురుమూర్తి-ఆతనినదృష్టిలాలించి మించి - ప్రీతిగాంచుడయ్య ప్రియ మిత్రులారా !

తే।గీ। మహితములకెల్ల విఖ్యాతమై జెలంగు
కందిమల్లయ పాలెంబు ఘనతరంబు
పుణ్యతర మహాక్షేత్రమై భూజనులకు
పాపనాశినియై కనుపట్టు మిగుల

పురమతాభి వర్ణనము

ద్వి। ధరణి దేవికి ముఖదర్పణంబనగ-సుర మునీశ్వరులకు చోద్యంబుగాగ-తాపసోత్తములకు తారకంబనగ-దీపించు సుజ్ఞాన దీధితినాగ-పామరులకు బుణ్యపాపముల్ దెల్ప - కామిత ఫలకంబుగా నొప్పి మహిమ-ధరణి భక్తుల కల్పతరు విదియనగ - వరికింప కైలాస పట్టణంబనగ-గోపురప్రాకారకుడ్యజాలములు-వాపీ తటాక సద్వన కూపములును - సకల లతా వృక్ష హీనతమైయొప్పి - యుకలంక

మహిమ జెన్నలరుచునుండు-ప్రాట సింహద్వారభవ్యక వాట - సక
లాతిశయ నిజస్థానమందిరము-సౌధాంతరంబున స్వామి వాసంబు -
బోధనా రుచులందు బొల్పారుచుండు

కీర్తన యమునాకల్యాణి - ఆట

వచ్చెనిదుగో-బ్రహ్మము వచ్చెనిదుగో-సద్గురుమూర్తి వచ్చెనిదుగో
పల్లవి।వచ్చెనిదుగో భక్తజనులకు మచ్చికలర మహానుభావుడు
సచ్చిదానంద స్వరూపము సర్వజనులకు జూపనిపుడు ॥వచ్చె।

1. మండలత్రయనేత్రుడై మార్తాండు డుద్భవమైనరీతిని గుండెలదరగ రిపులపై బడు-కొండయని భీతావహమొందగ । వచ్చెనిదుగో

2. నందివాహనుడయిన పరశివు డందరిని రక్షించుకొఱకై నంది దుర్గములోని ప్రమథుల - నందరిని వెనువెంటదీసుక । వచ్చెనిదుగో ।

3. ఆదిబ్రహ్మకులాంబుధికి గమ, లారి యుదయంబైన సామ్యము ఆది మూలంబగుచు భక్తుల నాదరింపదలంచి యిప్పుడు ।వచ్చెనిదుగో॥

4. ఆనియంతర్బాహ్యములకన, నాదమై తా నిజసమాధి వినోద వైఖరి మీర భరితాహ్లాదచిత్తముతోడ, వేడుక ।వచ్చె।

౫. కారణాతీత ప్రబోధ విచార పోతులూరి వీర ధీరగురుడు సమస్త సుజనోద్ధారుడయి కడు వేడ్క మీరగ । వచ్చెనిదుగో ।

ఆ। వె। బ్రహ్మవచ్చెననుచు భక్తితో పురజనుల్
చూడవచ్చిరపుడు చోద్యముగను
వందనంబు లిచ్చు వారల దిలకించి
బ్రహ్మ మిట్లు వేడ్క - పల్కసాగె

దర్బా నాదనామక్రియ - ఆట

నేనే బ్రహ్మమురా! పామరులారా! నేనె బ్రహ్మమురా
పల్లవి। నేనే బ్రహ్మముని నుడీ! కామాదిగుణముల
నామరూపక్రియల - నష్టాము పరచిన । నేనె బ్రహ్మమురా

1. ముదళ్లిలభావము - మూలము దెలిసియు
చిద్రూపమైవెల్గు - చిన్మయు గనుగొన్న । నేనెబ్రహ్మమురా

2. అష్టయోగాభ్యా - సమాధి సాధనలను
నిష్టాచే పెంపొందు - నిజరూప గనుగొన్న । నేనె బ్రహ్మమురా ।

పారగ గంటిమి భారతవిలాస! భాసురా ! ।జ్ఞా।

2 అ కం। పరమవిలాస శుభాకర
నిరుపమ హంసస్వరూప నిర్మలదీప
పరశివ మార్గకలాప!
కరుణానిధి నిమ్ముజూడ! గంటిమి మీకీర్తి వల గాంటిమి
నరులను కడు పామరులను గావున
చరణాంబుజముల సేవారతిచే గంటిమి మీ ।క।

వ. అంత సంతసంబున భ్రాంతిరహితులై, గురుమంత్రచింత నాంత శరణులైన వారల, ననంత దయారస స్వాంతుండయి శ్రీవిరాట్ పోతులూరి వీరనారాయణ పరబ్రహ్మంబు "చిత్తశుద్ధిర్భవతు" అని యాశీర్వదించి కూరుచుండెను

సిద్ధుని వృత్తాంతము – తెరలో ద్విపద

ద్విపద। శ్రీసద్గురు ధ్యాన చిత్తుడయి యాత్మ-భాసిల్లుచుండెడి భవ్య శీలుండు - ముసుమూల పట్టణమున నివసించి - యెడపక నుండు దూదేకుల కులజు - డగు సిద్ధు డొక్కనా డాత్మలో స్వీయ-మగు పూర్వజన్మవృత్తాంతంబు తానెఱనుగొని తలపోసి కాయంబు రోసి మును సద్గురుని దయామూలంబుడాసి - బూటకంబౌ పంచభూత జాలముల - నాటకుండగు వీరనారాయణుండు - నా పూర్వగురు డను న్యాయంబు దెలసి - ప్రాపు నీవని నమ్మి పాపముల్ జిమ్మి దుర్గుణంబు లడంచి దురితముల్ ద్రుంచి - నిర్గత స్థిరతను నియ మంబు పూని-దశ విధేంద్రియరాశి దమనంబుజేయ-వశ పడియెను భూతవర్గంబు లెల్ల - అప్పుడు సిద్ధాఖ్యు డానంద మంది - తప్పక సద్గురు దర్శింపదలచి—

సిద్ధుని దరువు – నాదనామక్రియ రాగం

రావే పోదాము, మానసహంస, రావే పోదాము, సద్గురుజూడ।రావే

1. రావే పోదాము యీ రవ్వ లింకేలనే, భావములో నగుబాటు నీ కయ్యేను ।రావే।

2. అండ పిండాండ బ్రహ్మాండము లందున । నిండియున్నట్టి యఖండ తేజుని జూడ ।రావే।

3. ఎడమ కడుపులనున్న యిడ పింగళ గంలను । నడి నాళమున వెల్గు నాగ కన్యను జూడ ।రావే।
4. చక్షుల నడుమను పశ్చిమ వీధిని నిక్షేపముగ వెల్గు సాక్షి భూతుని జూడ ।రావే।
5. లోపల వెలుగల ప్రాపుగా నిలచియు - వ్యాపకమై యున్న ఆత్మజ్యోతిని జూడ ॥రావే॥
6. పరిపూర్ణ నిర్గుణ భావము తానయ్యె - పరమాత్ముడౌ వీర బ్రహ్మము గననేను ।రావే॥
7. విరివిగ కడితూరాల వీరబ్రహ్మాచార్య - వరదుడై వెల్గు సద్గురు మూర్తి దర్శింప ॥రావే॥

కం. వీరబ్రహ్మము చెంతను
చేరి సదానంద పదవి చెందుట కొఱకై
కోరికపడి యా సిద్ధుడు
దారత గురుమూర్తి నిట్లు తలంప గడగెన్.

స్తోత్రం – పంచచామర వృత్తాలు

1. ధరామరాసురావరాదు దైవతత్వ దీపకం
చరాచర ప్రభూత భూత సైన్యదైన్య మాపకం
నిరామయా ప్రమేయచర్య నిష్కళంక రూపకం
విరాట్ స్వరూప పోతులూరి వీరదేశికం భజే॥
2. పరాత్పరం సురేశ్వరం సుపర్వ సర్వవందితం
దురాత్మ కవారి భంజనం సముజ్జ్వలాభి రంజనం
ధరాధరాధిధీర భూరిధైర్య కార్య కారణం
విరాట్ స్వరూప పోతులూరి వీరదేశికం భజే।
3. ధరాంబు వహ్ని మారుతా ప్రభతత్వ సత్య తారకం
'పురాంతకాత్మ భూమ్నరారి భూమిధీరరూపకం
నిరూపదీప కాత్మరూప నిష్కళంక భాసితం
విరాట్ స్వరూప పోతులూరి వీరదేశికం భజే।
4. పరాత్పరం నిరీక్షురం శుభప్రభాభి లక్షణం
నిరీక్షణాత్కటాక్ష వీక్షణేక్షణం విచక్షణం

సురక్షితాంతరంగ భావిసుద్ధభక్తసాక్షిణం
విరాట్ స్వరూప పోతులూరి వీరదేశికంభజే॥

5. ఖరాసురాదిమారణం సుఖప్రదాభికారణం
నిరాశ్రయాపనప్రకాశ సిశ్చితాశయాత్మకం
స్థిరాస్థిత ప్రభావివేక చింతనావిమర్శకం
విరాట్ స్వరూప పోతులూరి వీర దేశికం భజే

వ. అనియిట్లు స్తోత్రంబులుసేసి స్వాంతంబున శాంతంబు వహించి, విభూతి రుద్రాక్షమాలికాధరుండై యున్న సిద్ధునింజూచి యీశ్వర్య మందిఁ తల్లియైన ఆదంబి యిట్లని చెప్పందొడంగె.

తల్లికొడుకుల సంవాదం : దర్బా – ముఖారి – ఆది

తల్లి। వలదురాసిద్ధా ! వదలరా యీ భక్తి
కలిగియున్న మహ్మాదీయులగానక ను చెడిపోకురా । వల
కొడు। తల్లీ । నీవీలాగు తెలిసినపడనేల
తల్లిపిల్లలు మాయయనుచును ధరణిపెద్దలుచెప్పరా । తల్లినీవీలాగు
తల్లి । మతముతప్పి వేరెమతము బట్టగనేల
మతములంనును ఖురానుకంటె మంచిదెచ్చుటగల్గురా ! వలదురా
కొడుకు। మతములుచెప్పేటి మాటనీకేలనే
మతము గల్గినవారు తమ చెడుగతులుగానరు తెలియవే తల్లీ ।
తల్లి। ఎందులకీ భ్రమజెందెదవురా పుత్ర
అందరిట్టుల తల్లికిని మొనరాడ నేస్తురె కంటివా ? వలదురా
కొడుకు । ఎందరెన్నిటజెప్ప, నేమి సద్గుణదయ
జెందనేరని మానవులతో మదలింపగనేలనే ! తల్లీ నీవీలాగు
తల్లి । హాటము జేసెదవేర – అకటా నీకీబుద్ధి
పటుతరంబుగ నెవరు నేర్పిరి బాలుడవు నీకేలరా ! వలదురా
కొడుకు । బాలవృద్ధుల నేటిపలుకులు నీకేల
చాలగా యీ మనుజులందరు చచ్చిపుట్టుట కానవా । తల్లి
తల్లి, । తల్లిదండ్రుల యాజ్ఞ దప్పుట ధర్మమా
యిల్లు వాకిలివిడిచి నీవిటు వెళ్ళిపోవగనేలరా । వలదురా
కొడుకు । తల్లిదండ్రుల మాయ తగ బంధుజనులిండ్లు

వెళ్ళిపోయేనాడు యెవ్వనివెంట వత్తురు కానవే। తల్లినీవీలా

తల్లి। యెన్ని నేరిచినావు చిన్నవాడవు నీవు

కన్నతల్లి యటంచు కొంచెము కనికరములేదాయనా। వల

కొడుకు। చిన్న పెద్దయనుట చెప్పగనొప్పు

చిన్న సింహపుపిల్ల యేనుగు గున్నలను ఎదిరించదే। తల్లి

తల్లి। ఎవ్వరీలాగున హితవు జెప్పిరినీకు

నవ్వునాటలుగావు నినుబోనివ్వ నింతటలిల్వరా। వలదురా

కొడుకు। దారి కడ్డంబేల దగిలెద వీరీతి

కోరి వీవ్వారాక్యుల్ కవినుతే వీరసద్గురుగానవే। తల్లినీవీలా

చ. వినగదె తల్లి నామనవి విశ్వమయుండగు వీరసద్గురుం
డనగ మహాత్ముడాయన పదాబ్జములన్ హృదయాంత రాళమం
దునిలిపి గొల్వ గల్మషవిదూరసకములన్ మనుజన్మకర్మముల్
కనలి దహించు. నంతట వికాసము మోక్షపదంబు జూపెడున్

తల్లికొడుకుల సంవాదము, ముఖారి — ఆటతాళము

తల్లి ! ఏమిరా ! సిద్ధా, చెప్పిన విన వేమి సుబుద్ధా
మోమాటముంచి, నామోమునుజూడవిదేమి
ధీమానమా, నాపై, అభిమానమాయింతే ।యేమిరా।

కొడుకు । వినుమమ్మా జననీ, నీ మాటలు వినమదిబూని
వినయముతోడ నేపనిచెప్పిననుగాని
వినుటసద్ధర్మము వివరింపగానేల ।వినుమమ్మా

తల్లి। ఏలర కొడుక ! నా మాట వినవేలరనుడుక
గోలావన్నెండేండ్ల బాలుడవై నీవు
చాల నజ్ఞానమాలీల ద్రబేలెదవేల ।యేలర।

కొడుకు। తడవేలనమ్మా యీ పనికెట్టి గడువేల నమ్మా
పుడమిజీవులకెల్ల పుట్టుట గిట్టుట
యెడ తెగకుండుట, యెరుగవే గురుజేర । తడవేలనమ్మా

తల్లి । చిన్నతనమున యిట్టి జ్ఞానమెన్న మనమున
కన్నకొడుక నీ కేమనులు బోధించిరో
నన్ను వీడుట నీకున్యాయమటర తండ్రి ।యేమిరా।

కొ॥ చిన్నతనమున, పెత్తనమైన చెడిపోదుగాన
చిన్నా పెద్దతనాలు జీవునకును లేవు
పన్నుగా నిది మట్టిపాలై పోవునుగాన ॥విను॥

త॥ కులమతము వదలి, మతమును జేరవలచియు గదలి
వలుతనంబున పరుగులెత్తగ నీవు
వలచిన యజ్ఞాన వాంఛవీడుకొని యింక ॥యేమి॥

కొ॥ కులము మతములు కలిపూయచే గలిగె భేదములు
కులము బిందు రక్తములు రెంటిచే నాయె
తెలియని హీనులు తెలుపు మార్గముగాని ॥విను॥

త॥ వీరకుమార! బంధువు లెన్న మారుదు రార
ధీరుడా పోతులూరి వీరబ్రహ్మ
మీరీతి నుపదేశ మారూఢి జేసెనా? "యేమిరా సిద్దా"

కొ॥ ఖండితముగను యీగతి బల్కగాదమ్మ జనని
కొండ శంకరకవి కళార్ద్ర నారాధించు
దండి పోతులూరి దైవము నెఱుగవు ॥విను॥

అదంబి కందార్థము

కొడుకా విన విధి యేలర
దుడుకు పనుల్ సేయ నీకు దోసంబౌరా
అడిదేరాన, లేల జెందెదు
విడువుము నా జ్ఞానసుతుని వీరబ్రహ్మమునూ
నా మాటలు వినియు బ్రహ్మమునూ
కడుపున బుట్టిన కారణమున నిన్ను
విడువజాలక నిట్లు పాలించుచుండగ నలసె, వీరబ్రహ్మమునూ
నా మాటలు వినియు బ్రహ్మమునూ

సిద్ధుని కందార్థము

జననీ విడువను జ్ఞానమ:
మనమున నీ సందియంబు మానుము వేగన్
జనులమా లోనికి నిప్పుడు
ఘనిగొని యూ వీరగురుని పాదముల విడనే

ఆలోచింప బనిలేదు విడనే
మునుకొని సుజ్ఞానమునగాని నరునకు
జననాది గుణము సాధనచే నశించగా । పాదము విడనే

అదంబి సిద్ధుల సంవాదం — ముఖారి రాగం కీర్తన

ఆదంబి । కానిపని యిది పూనకూడదు
సూనుడవు నామాట వినవిది యేలరా । యీ చలమేలరా ।
సిద్ధు । కల్ల సంసారంబు నిజమని
గట్టిగా నా మనసు కెంతయు నాటదే, చెప్పేమాటదే
ఆదం । తల్లి దండ్రుల మాట మీరుట
తగదురా యీ లోకులెల్లను నవ్వుదురూ నినకచెడుదురూ
సిద్ధు । తల్లిదండ్రు లనంగ నెందరో
ధరణి జీవుల కెల్ల జన్మను లెరుగవే, సత్యము నెరుగవే
ఆదం । చిన్న బాలుడ వౌర మాటలు
ఎన్ని నేర్చితి వింక జెప్పగజాలనూ, వాద మేలనూ
సిద్ధు । ఎన్ని చెప్పిన సద్గురుని దయ
కన్న మిక్కిలి లేదు జగము లబద్ధమూ, బ్రతుకే వ్యర్థమూ
ఆదం । తనయ నీకీ బుద్ధి తోచుట
దైవచిత్రము గాన నిన్నే మందురా, యే విధి మందురా
సిద్ధ । దైవచిత్రమటంచెటిగినా
దారికడ్డము వచ్చుటను యిక మానవే. కనికర మూనవే
ఆదం । మేరగాదుర పోతూలూ
వీరసన్యాస సేవ యిక చాలించరా, నన్ను మన్నించరా
సిద్ధ । అరుదుగా కడేసూ విప్రా
ర్యాత్మ్యకు రతుకుని విడువజాలనే । మాట చాలనే
వ। యిటుల కటుకతనంబున మాటలాడు కొడుకుంగనిపో యుమీరు
సాహెబు అనే పేరుగల తండ్రి సిద్ధునితో నిట్లనె—

తండ్రి కొడుకుల సంవాదము ముఖారి రాగం — ఏ

తండ్రి । వద్దురా! సిద్ధా! వద్దురా యీజ్ఞానమూ
హద్దుపదు దిద్దలేని మొద్దుతన మది సద్దరా! వద్దురా।

సిద్ధప్ప స్తోత్రం - చూర్ణిక

శ్రీమదఖండమండితసచరాచర బ్రహ్మాండ భాండోదర సహస్ర కిరణ వరణమార్తాండ మండలార్చిత చరణరాజీవయుగళం బ్రహ్మవిష్ణు శివాఖ్య ప్రభాభాసమానాంత ప్రతాప దీపం। చందనాగరు కస్తూర ధూపవాసిత బంధురనిజానంద తుందిలవిభ్రమ భ్రమాలంకారహృదయ కలాపం। జగన్మోహనస్వరూపం। నటనస్ఫుట పటుపటాత్కార భావోత్కట చిటలతటఘటిత త్రిపుండ్ర రేఖాభాసితాంసం। జటాపటలపటుతర కోటిసూర్యప్రభాసముత్కట దికట సందూర్వాతాట్టహాసభాసురం - హఠయోగాభ్యాస కౌశలవితానంత కోటిభటసముజ్జ్వల సుఘోషం - శాంత శమదమానంత కళ్యాణగుణవిశేష విభ్రాజమాన మహామంత్ర యంత్ర తంత్ర భయనివారణోచ్చారణ కార్యకారణ ధ్యక్షురక్షాచరణ దీక్షం-రక్షణావిచక్షణ సాక్షాత్కార దీక్షార్ద్రకటాక్షేక్షణలక్షిత మోక్షాస్పద సూక్ష్మం - భక్తజన కటాక్షం - యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యానధారణ సమాధీప్రముఖాష్టాంగ యోగనిరతాభ్యాస భాసమానం - సిద్ధాగరిష్ఠ సృష్టిస్థితిసంహార తిరోధానానుగ్రహక్రియ సమర్థ నిగమాగమప్రమచార సారలక్ష్యార్థగోచరవిరాజం - శ్రీమన్మహా మండితోద్దీపిత కనకమణిఖచితగోపుర ప్రాకారసౌధాంతర కందిమల్లయ పురవిహార పరమహంసాయమాన విశ్వేశ్వరాంశా ప్రకాశిత బ్రహ్మ రూపం - శ్రీమద్విశ్వకర్మవంశ పయఃపారావార రాకాసుధాకర కడియాల మల్లయాచార్య తనూభవ వీరబ్రహ్మాచార్యసమర్చితదివ్యపాదాంభోజ యుగళం - త్వాం భజామి గురువే పాహిమాం పాహిమాం పాహిమాం

వ। స్తోత్రపాఠ మహాత్మ్యసూత్రాకాంబద్ధ షడ్వర్గ నిరుద్ధబుద్ధినిజ దూరీకల సిద్ధుండు చరణాబ్జ ధ్యాన సంబంధ బంధురుండౌచు యెరింగి వత్సలత్వమున దత్సమయంబున సతిని గటాక్షించి హస్తమస్తక సంయోగంబుజేసి శ్రీవిరాట్పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వాములు లేవనెత్తి "చిత్తశుద్ధిర్భవతు" అని యాశీర్వదించి యిట్లనియె

కం. వర్ధిల్లుమోయి సిద్ధా
వర్ధిల్లుము చిత్తశుద్ధి వలన ప్రసిద్ధా

వర్ధిల్లు జ్ఞానబుద్ధా
వర్ధిల్లుము నిరుపమాన భక్తి శ్రద్ధా

వ॥ అంత సిద్ధుండు జ్ఞానాస ప్రబుద్ధుండై శ్రద్ధాభక్తి పూర్వకంబుగా శ్రీ విరాట్పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వాములవారి చరణాంబుజంబులకు సాష్టాంగ దండప్రణామంబు లాచరించి, లేచి, నిలచి పరశివయోగం బుపదేశింపుమని వేడుకొనుచుండు సమయంబున

చారుని వాక్యములు

శా. ఓరీ! నీకులమేమో, నీ స్థలమేమో, నీ వూరి పేరేమో, నీపేరేమో, నీ తలిదండ్రు లెవరో, టక్కుమాటలతో నిక్కక - నిక్కంబుగా, పెక్కుమాట లాడక చక్కగా దెలుపరా వోరి!

సి॥ అలాగే దెలుపుదునయ్యా స్వామి

సీసారం । మాయూరు ముడుమాల మా తండ్రి
వీరుసాహెబు తల్లి ఆదంబి హెచ్చుగాను
యేకులు జేయు దూదేకులమని
లోకు లాడుదురు నీకాకుగాను
వారికి గొమనుండ, వసుధలో నా పేరు
సిద్ధుడని వచింతురూ, సిద్ధముగా న
బద్ధము లేదని యెంతురూ
నద్దికతో నా మొద్దుతనము విడ
దిద్దెడి ప్రభువుల యొద్ద జేరితిని
నద్దయ తోడుత బుద్ధిజెప్పి నను
హద్దుతప్ప నిది తద్దయు సత్యము । సిద్ధుడని
బ్రహ్మంగారు - సీసపద్యము
సకలజనంబులు చనువుగ మీ తల్లి
దండ్రులు పిన్న పెద్దలును స్త్రీయులు
అందరు వినజెప్ప నెందుకు నీ రీతి
విచ్చేసినాడవు వెఱ్ఱిగాను
పరవస్తువు నెఱుంగ బ్రహ్మాది సురలకు
తరము గాదిక నీకు దరమె తెలియ

ఈ కొట్టి నీ కేల యిలదాకనుత వాంఛ
గలిగి వర్తించుచేటే ఘనము సుమ్మీ
యెంతమాత్రము కూడదు యిట్టిబోధ
బాధ నీ కేలరా యింటిపట్టు నుండ
దారి జూచుకు వెళ్ళుము తగదుసూని
యిట్టి యపవాద మేలరా యిలను నూక॥

బ్రహ్మంగారికి సిద్ధునికి సంవాదం – దరువు – ఆదితాళము

బ్రహ్మ। వద్దు వద్దు బుద్ధి వినవో యీ దూదేకుల సిద్ధా
వద్దు వద్దు బుద్ధి వినవు హద్దు తెలియు నెవరితరము
సుద్దులుగాదు వద్దుగాదు వు నాత్మరూప మరు మాటదెలియ

సిద్ధ। వదలిపెట్ట నీదు పదములు శ్రీగురుబ్రహ్మం
వదలిపెట్టను నీదుపాద, వనజములు ముదము మీర
చదలుగాదు అగ్ని నీదు జగతి కాధారంబు దెలుపగ ।వదలి।

బ్ర। గగన సదృశంబైన యాత్మ గనగ నెవరి తరముగాదు
ముగ్గురుమూర్తుల కలవిగాని, మూలవిరాట్టుగడగడవడకెను ।వద్దు

సిద్ధ। మూడుమూర్తుల కలవిగాని మూలమేదో గురునిమాత్రము జాడా
దెల్పక నన్ని చెప్పిన సర్వసాక్షిని తెన్నుగానక ।వదలి।

బ్ర। అందరాని మానిపండు అందితే ఫలమందలేవు
ముందువెనుకచన దెలియక నీవు మూలవిరాట్టు స్వరూప
మయ్యేదే ।వద్దు।

సిద్ధ। అంది అందరానిదయ్యూ నందు యిందానాక నిండి
నందుగొందుల లోపలనుండే సర్వసాక్షిని దెలిపినగాని ।వదలి।

బ్ర। ఆడదియు మగవాడుగాక, జోడుగూడి యుండగాను
ఆడ దీడది యనుచు చూచే, ఆత్మలో పరమాత్మయాసిది ।వద్దు।

సిద్ధు। ఆత్మనాత్మ భావమేదో, అంతటా తానైన దేదో
ఆత్మగాక తాను ప్రత్యగాత్మను మూలమును జూపక ।వదలి।

బ్ర। దండి మొండి మాటలాడి గుండెదిటవున నుండినావు
గండికనము దారిలో నీవండజేసుక నుండగలవా । వద్దు।

సిద్ధు । పండువెన్నెల వోలెనంతట నిండియుండి దండిగా నఖండమైన వస్తువుకునై, దండము మెండుగా పెట్టితి । వదలిపెట్ట

కంధార్థము

దేవా నీదుమహత్త్వము
భావింపగ నెంతవాడ పామరుడను నన్
గావ తల్లిదండ్రు లాప్తులు
దేవర మీకంటె వేరే దిక్కెవరయ్యా
నాకిక ముక్తి - తెలుపవియ్యరయ్యా
భూవలయమునందు పుట్టుట చచ్చుట
భావింప నిట్టి దుర్భ్రమల జెందగనీక । దిక్కెవరయ్యా ।

బ్రహ్మంగారు - సీసపద్యం

వినరోరి చెప్పెద విశదంబుగా మూడు
గుణముల నీ మర్త్యకోటినేడు
షడ్గుణంబు లరియు సాధింపగారాని
పంచేంద్రియములచే పట్టువడును
త్రిగుణంబు లవియును తెలుపుసేయగరాని
వందు నొక్కటిరాజు చెందెడిని
శుద్ధజడంబుగా బద్ధు జేయుచునుండు
మాయాంధకారంబు మమత గప్పి
గాన నీవిట్టి లీమాయ గడువవలెనె
యోగ మదియేడ, నీవేడ, సాగిపొమ్మ
తలప గూడునె యీ మహాతత్త్వ మహిమ
తెలియ రెవరు సిద్ధుడా ! తెలియుమోయి.

సిద్ధప్పకును బ్రహ్మంగారికి సంవాదం - ముఖారి - అట

సిద్ద । గురువరేణ్య పదాబ్జములు హృత్సరసిజంబున మ్రొక్కినిల్పితి
బ్రోవుమూ, నన్ను గావుము
బ్ర। హరిహరాదుల కందగూడని పరమగుహ్యం బైనవాక్యము
చిక్కునా నీకు దక్కునా
సిద్ధ । భక్తవరద దయాకరా బహురిక్తుడను నన్నేవిధంబున

గాతువో దయను జూతువో

బ్ర। తామసాదులు దుర్గుణములవి స్తోమమై బాధింపుచుండును

మానవుా వాటిని కావున

సిద్ధ। పతితుడగు నను పావనునిగా - హితముగా నీ సుతునికై వడి

చూడగా కోపము వీడవా

బ్ర। మున్ను తాపసులెల్ల చిన్మయమూర్తిగా నక ఘోరకానల

దరిగిరీ - మెరుకా మంగిరీ

సిద్ధ। సూరిజనసుత పోతులూరి, వీరసద్గురుడంచు చెంతకు

జేరితీ మోక్షము కోరితీ

బ్ర। తారతమ్యము జూడ కాత్మవిచార మర్మ మెరుంగ జేతురు

వ్యర్థులూ వా రసమర్థులూ

సిద్ధ। ధారుణిని కడియాల శ్రీ వీపూరి సత్కవి రక్షకుడ విక

బ్రోవవా, నను దయ గానవా

కందార్థం। పరమాత్మ భవవినాశక

సరసదయా పూర్ణచంద్ర సంతతసుగుణా

వరదాయక నను బ్రోవుము

గురుడని నిన్నాత్మదలచీ - కొంటినీ

భవముల నియమంటినీ - నిర్వాదు పజాల, నంటినీ

హరిసరసిజభవ, సురనరవర నం,

స్మరణ చరణయుగ సతతము నమ్మియుంటిని

బ్రహ్మంగారు - నీసార్థము

శ్రీ సచరాచర సృష్టికావలివెల్లు

అతిరహస్యాధార మైనవెల్లు

స్థూలసూక్ష్మవిభూతి శోభితంబగు వెల్లు

అన్నిట బరిపూర్ణమైన వెల్లు

బ్రహ్మాండ గోళ సంభ్రమ మూలమా వెల్లు

బ్రహ్మాదుల కెరుంగరాని వెల్లు

గురుకృపచే గాక గురికీ డాయని వెల్లు

నీ కెట్టులగుసాధ్యమూ ఎన్నగ ప్రాజ్ఞ - లోకమునకె బోధ్యమూ

మరి నీలతో యదమర్థ్య విద్యుల్లేక
మాడ్కి ప్రకాశించు మహాగు వెన్నెల పేట నీకెట్టులగు సాధ్యము॥

సిద్ధుని ద్విపద — ముఖారిరాగం

ద్వి॥ వినవయ్య గురునాథ విన్నపంబొకటి - మును పరశివయోగమున కున్నై మిమ్ము - సకలంతేముగ మానసార్చనజేసి - యొక జన్మ మెత్తితి యుర్విఁ దద్ జ్ఞాన-బీజన్మమునగల్గె నీడేర్చు తండ్రి-నై జాశ్రయంబిచ్చి నా గురునాథ - అష్టాంగయోగ సదభ్యాస నిరత్య నిష్ఠాగరిష్ట నిర్ణ్రద్రసిల్లేప - ఘనతపస్వాధ్యాయ కారణాతీత - అను దినంబును నిన్ను నాత్మ నేననుచు - పసబడి గ్రహించు భావంబు నాత్మ - జనించుటాదిగా చరణాబ్జసేవ - గురు పరబ్రహ్మ నిన్ గోరు చున్నాడ - పరతత్వనుజ్ఞాన పరమాత్మ నిన్ను - వదలిపెట్టను సర్వ వాంఛల విడచి - సదమల మతిని మీ చరణసేవాభి రతుడనై యున్నాడ ప్రాపునీవనుచు - గతినీవె మతినీవె కారణంబిచ్చి - నను కృతార్థునిజేయ నాథుండ నీవె-జననాదులందు సంశయమేల తండ్రి కరుణాళుయోగసిద్ధ కావుమటంచు - శరణుజొచ్చిన మహాశ్చర్యంబు తోడ-కరుణాంతరంగుడై కం మెప్ప ప్రేమ-కొరతలుదీర సద్గురు డిట్టులనియె

బ్రహ్మంగారు సిద్ధుడు సంవాదం — శుద్ధసావేరి-ఆట

బ్ర॥ వినరోరి సిద్దా నా మాట నీవు వినగోరితివె ముక్తి బాట
తనువు ధనము మనస్సును సద్గురునిపాద
వనజములకు నొప్పబసిచి నిశ్చయబుద్ధి
నునిచి పూర్ణసమాధియోగము గనుట సాధ్యముగాద సల్పము
వనజభవ రుద్రాదిసురలకు వశము గాక తపించుచుండిరి ॥విన॥

సిద్ధ॥ ఏరీతి వినుచున్నగాని, ఆజ్ఞమీరక నడచెద పూని
కోరితి నీపాదసారసములు నా హృ
త్సారసమున నిల్పి యారాధింపగ మోక్ష
ద్వార మది వీక్షింప దుఃఖ నివారణంబై జనన మరణ వి
కారరహితంబై సదా పరిపూరితంబై నిజము గన్నడ ॥నేరీతి॥

బ్ర॥ కోరి వేడినను రాదోరి, అది కోరకుండిన పోదు విూది

ధాయణి ఘోర సంసార వారధి బాట
దారి తెలియక మున్ను తాపసోత్తము లెల్ల
దారసుత ధనవాంఛచే బరితాపమున దపమెల్ల గోల్పడి
వారు గొర్రెలనంగ చోరబడి ఘోరనరకము లనుభవించిరి ॥విన
సిద్ధ॥ పదపడి నన్ను రక్షింప, మీదె భారము నన్ను శిక్షింప
చెదరక వదరక పదరక బెదరక
కదలక మెదలక గన్పించు జయజేదో
అదియు నాకు నెరుంగజెప్పియు అంతరార్థంబుల బయలున
సదనమయిన మహాప్రభావము-సహ్నమాధిని జెందజేయుము ॥ఏరీతి॥

సీసపద్యము

శ్రీ గురుస్వామి నీ సేవాభిరతుడను
జడుడు పామరుడని సంశయింప
వలదు నా యెడ కృపావార్ధివై దరిజేర్ప
దగునయ్య మీ యాజ్ఞ దప్ప నెపుడు
తలిదండ్రులను బాసి తగు బంధువులను రోసి
యన్యుల గోరక యనుదినంబు
గురుడె దైవంబని గురిజేసికొని మోక్ష
సాధనకై సేవ సల్పనుంటి
తడవుసేయక నన్నిక ధన్యుజేయు
భారకర్తవు నాపాలి ప్రభుడ నీవు
పోతులూరి సువంశాబ్ధి పూర్ణచంద్ర
వీరగురు రాయ సద్ధర్మ విభవగేయ

బ్రహ్మంగారు – వ్యాఖ్యాన

ద్వి॥ వినరోరి సిద్ధ తద్విధమెల్ల దెలిపెదు – అనుమాన భక్తిచే ననుకూల మయిన-గురుశిష్య మర్యాద కోరినారుగను – పరమధర్మంబయిన పద్ధతుల్ నాల్గు-గలవు చెప్పెద వానిక్రమముగా నీవును తెలియంగ దగును సుధీరత మెరయ-తనువు నర్థంబును తగ నిచ్చి మ్రొక్కి-మనసు నిశ్చలబుద్ధి మమత డాయంగ-మది నాస చేనను మాయను బాసి పదపడిసుజ్ఞానపదముగ్రహించవ-తగునుము క్తికాంతను తమిదీరగూడ్చి

అర్థ గీతార్థం

జనక మాకు నొక్క సంశయంబు ఘటించె
హీనకులుడు దూది నేకువాడు
వచ్చి మీ కటాక్షవశుడు గావలెనని
కోరియుండినాడట నేటికి - రాకూడదని మున్నాటికి
కోరివేడినను కులహీనులకును మేరగాదు సత్కార్యము సేయ।నేటికి।

బ్రహ్మంగారు కందార్థం

వరపుత్రులార మీరలు
గురుతరముగ నెంచనేల కులమర్యాదల్
మెరుగరే రేతఃకులమని
పరికింపగ నేలవర్ణ - పద్ధతులెల్ల అది తెలియరు మానుసులెల్ల
పరిపరి సంగతు లరయుచు బహుశాస్త్ర
వరులెల్ల కులమని మొరిగేరు సుజ్ఞాన।పద్ధతులెల్ల।

గోవిందయ్య - దరువు

1. నీచజాతివాడవగుట నీకు దెలియదా సిద్ధా
నీచజాతి మరచి పలుకు నీకు మాకు సాటిరా ।నీచ।
2. నాదమేల నీవు మా పాదముల బట్టనేల
కాదంటె కారణంబు లేదు లేదు వెళ్ళరా ।నీచ।
3. భీతిలేక మాతోడ నీతులాడ జూతువు
ఖ్యాతిలేదు చెప్పు చేతు ఛే తెరుగున జూతువురా ।నీచ।
4. నీ కులంబువారిలో ననేక పెద్దలున్నారు
మాకు మీకు పొత్తుగాదు లోకులు పలుగాకులు ।నీచ।
5. ఎన్ని చెప్పినను వినకున్న పేతు వేమిరా
మన్ను మిన్ను తెలియదా చన్ను గుడుచు వాడవా? ।నీచ।
6. గురుండు మీరి మెండులాడ గండమింక వచ్చురా
మొండిబండ వానివలె నుండు టేమి దండిరా ।నీచ।
7. విరివిగాను పోతులూరి వీరగురుని కరుణ యింక
నిరతమ్ము వెలుంగుకతన, నేటి దనుక బ్రతికితివి ।నీచ।

పోతులూరయ్య సిద్ధయ్యల సంవాదము – కాంభోజి ఏక

పోతు। ఎవడురా। ప్రవిమలసిద్ధు డెవడురా, సిద్ధుడనువాడెవడురా !
భువిలోన మావంటి పురుషోత్తములడాయు
భవుడు సారసభవుడు లక్ష్మీధవుడు కలశోద్భవులు జాలరు ।ఎవ।

సిద్ధ। ఎందుకూ నాతో వాదమెందుకూ యే సందేహ మెందుకూ
ఎందుకు మీ పాదద్వంద్వము హృత్కమల
మందునిల్పినవాడ సద్గతి నొందజేయగరారె ధీర ।ఎం।

పోతు। మెచ్చుటా నాతోనా, ముచ్చటా ? బ్రతుకక నేల చచ్చుట
మచ్చికలో ముని ముచ్చులాగున వచ్చి
మచ్చరము విడి చచ్చెదను దుష్టేచ్ఛబలికెడి తుచ్ఛుడగునీ వెవ॥

సిద్ధ॥ మాటికి నస్వాదనాడ నేటికి మిమ్ము విడన్ ముహూర్తకి
నూటిగా నా మదిని నాట సుజ్ఞానము
దీటుకొల్పెడి భక్తి గొల్వగ దిక్కుమీరని వేడి మ్రొక్కితి ।ఎం।

పోతు॥ గట్టిగా మా తండ్రి పదములు బట్టగా, గిట్టక మేము తిట్టగా
చుట్టు తిరుగుచు నెట్టెట్టులో పలుకుచు
చుట్టువలెనే తట్టుగదలక వట్టువిడువవు మట్టెదను నీ ।వెవడురా।

సిద్ధ । వీడనూ, నే పరులను వేడను, దుర్జనులను గూడను
ఏడి నా ప్రభుడు యీ రేడు లోకములందు
లేడనుచు వెరనమ్మియుంటిని, వీడనిడు భూజాతమా మీ ।కెం॥

పోతు॥ శంకగా, అంకెకురాడే వంకగా, తలవడెంతైన బొంకగా
శంకరాఖ్య కవి నంతరింపగ బ్రోచు
శంకజాత్ముండయిన వీరబ్రహ్మమున కింక నెదురాడ ।నెవడురా॥

సిద్ధుడు – మత్తకోకిల

స్వామిచే మిము నాశ్రయింపగ జాలితిని దయరామి కి
క్లేమి కారణమయ్యె నన్నిటు హీనకులుడని యెంచితే
వేమతిన్ బరిశుద్ధిచేసి వివేకమిచ్చియు గానవే
తామసింపక పోతులూరయ దైవరూప దయానిధే

గోవిం। నీతిజాడ జాతిగాదురా యీతీరున భీతివనలుట ఖ్యాతిగాదురా
హేతువేమో తెలియరాదు భావమందీ భక్తితేను
ప్రీతిలేకనా విభూతి జ్యోతికేతి కందరాదా ॥వల॥
సిద్ద। జాతిభూతి లేదువాడనని నో యయ్యా గతియేమో బుద్ధిచూడను
పోతులూరి వీరగురుడు నాతోగా ని భీతిపోను
నాతలవు నీడేర్ప నీవే నీతితారకా, నన్నేవనఖర్మ ॥జాతిభూతి॥
పోతులూరయ్య, సిద్దడు వద్ద – అనంతకారణ – అని
పోతు। చిక్కడూ బ్రహ్మము దక్కడూ సిద్దా నీకు చిక్కడూ
చిక్కదయ్యా బ్రహ్మభేషజము, చక్కనౌ గురుపాదపద్మము
నిక్కముగ నెరనమ్మువారికి చిక్కనేనోయకాని, మాయకు। చిక్క
సిద్ద। ఎందుకూ వాదామెందుకు, అయ్యసామి ॥ఎందుకు॥
ఎందుకునాతో వివాదము, నెప్పుడూ సద్గురునిపాద
ద్వంద్వమును నెరనమ్మికొలిచే టందుకే జన్మించినానిక ॥నెందు॥
పోతు। శాంతియు క్తత తెలియకను సామంతులై కలిమాయవాదుల
చెంత వింత లడంచగా నిక నెంతవారైన నగాని ॥చిక్కడూ॥
సిద్దు। చిన్నతనమునాటినుంచి, కన్నపుత్రుని యూరుగానే
నున్న సంగతినెఱిగి గురుడు ప్రసన్నుడై రక్షించడా ॥నీకె దు॥
పోతు। కులమువానన కలిమివానన కలిమిలో దిగ నూదిమూనను
కలుషగతి దొల గన్న వారికి కలుగునేమోగాని బ్రహ్మము ॥చిక్క॥
సిద్దు। కులము కులమని మాటిమాటికి కళవరము నిందించెదవూనా
కులముతో పనియేమి ఘనుడౌ గురుడునను రక్షింపడా ॥నీకెందు॥
పోతు। తనువు మనసు ధనము గురునకు ధారవోసి యిలనురోసి అఘు
శాంతముననడినా బ్రహ్మాది మూర్తులకైన గాని ॥చిక్క॥
సిద్దు। తనువు ధనము మానమునాడే, వినయముగ నర్పించియుంటిని
కనికరంబున వీరగురుడిక గాంచినను రక్షించునీకిటు ॥లెందు॥
వ। అని ఈప్రకారము మాట్లాడుచున్న వారి మనోభావంబుగ్రహించి
శ్రీ విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వాముల వారున్ను గోవిం
దమ్మగారున్ను దూదేకులసిద్దని బిలచి యిట్లు చెప్పదొడంగిరి.
యును పేర వెలసి వీరసద్గురు కృపావిభవంబువడసి – అరయు

బ్రహ్మంగారు, గోవిందమ్మ సిద్ధుల సంవాదము వర్ణజాతిస్వరూపం ఆదితాళం

బ్ర॥ సిద్ధా! బుద్ధా! యిద్ధాత్రిని శుద్ధులేదా
శ్రద్ధలేని వద్ధ గల సద్ధర్మికుడు వ్యర్ధుడగును ॥సిద్ధా॥
సి॥ ఏమీ! స్వామీ! నా మది నిశ్చలగలుగదు
నా మనమున మీ మహిమలు పై బలిమిలె సేవగలిగె ॥ఏమీ॥
గోవిందమ్మ॥ ఏలా! కేలా! చాలగ మిము గొలుచుచున వేచే
మూలమున తెలియుగ శిరమా నుంచెదరు చేకొనిన గనగా ॥ఏలా॥
సి॥ జననీ! వినుమీ! మనమున కెనుబొండజాల
వినయముగను, పరము దెల్పు నీమతి జేతు ననవగతేము ॥జన॥
బ్ర॥ వినుమా! కనుమా! యనుమానము విడువు వేగ
మనసు నిలిచియున్న యొగాజె, ఘనపదంబు నెరుగనౌను ॥విను॥
సి॥ గురుడా పరుడా పరమాత్మండ నీ చనెనలు
యెరుక మనువుతెలియబట్టి పరబ్రహ్మము గురుతు దెల్పు ॥గురు॥
గోవిం॥ చేటా! మాటా! బాటెరుగని మాటలేల
తాటోటగు మాటలతో, నాటపడును పరతత్త్వము ॥చేటా॥
సి॥ అమ్మా! కొమ్మా! యిమ్మహి మిము బోటివారు
ఇమ్ముగ నమ్మిన వారిని, సమ్మతింపకుందురె ॥యమ్మా॥
కం॥ అని గోవిందాంబికయున్
గసలుచు వాకొనుట చూచి కడు శాంతమునన్
మునికొని బ్రహ్మముగారి
ట్లని చెప్పందొడగి రప్పుడాశ్చర్యమునన్

బ్రహ్మంగారు – ద్విపద – ముఖారి

ద్వి॥ వినుము గోవిందమ్మ వివరంబు గాను – మనసు నాలోచించు
మర్యాద నెంచు – పోతులూరా! నీవు పాలుపొంద నినుపు-జాతి
భేదము లెంచ సహజంబుగాదు – ప్రారబ్ధంబెటులనుండు ఫాలాక్షు
డెరుగు – ఆస్తికైన నయ్యది యంటగలదె – మర్మంబు
తెలియుగా మాధవు దరిను – సర్వాత్మ మహానువాశీనుడేకపడు –
పలుమారు కులమని పల్కుచు రేల కులము నేమని చెప్పకుం
దురు మాయ – జనని గర్భంబున జనకుని వీర్య – మున గూడిపిం

భక్తాళి నగయువిచ్చెసె।

కీర్తన – కల్యాణిరాగం – అటతాళం

జనని ఈశ్వరి వచ్చె సభకు, సంభ్రమమున సర్వలోక జననీ ఈశ్వరీ
పల్లవి।జననివచ్చెను జనులందరు ఆశ్చర్యకరమై చూడగ చక్కని
కళాసంపూర్ణ విగ్రహ, ముని సహా ఘను లెన్ను చుండగా ।జనని।
1. తరమున దండముతో పాదుకలతో కాషాయ చేలముతో
మెరయుకుంకుమ రేఖకాంతులు మించి బాలార్కుని జయింపగ
సరి సుహాసిత హారములు శుభ్రాంశు కిరణముల బరిహాసింపగ
2. కరకంకణ ధ్వనులు, ఘల్లున మ్రోయగాను బంగరుసొమ్ములూ
పదిలల పట్టుసరులు వెలయగ వినతులై తరుణీమణులు చా
మరములను వీచంగ మేల్ తత్తి, కురులజడ వ్రేలాడుచుండగ ।జనని॥
3. కోటితేజస్సులతో నౌదార్యరంపు మేటి కిరీటముతో
కోటికాంబరదీప్తి దక్కులు మేటిధాతువు లుగ్గడింపగ
సాటిసరి లేనట్టి కలుష సుహాటవికి నికుఠార మోయున ।జనని॥
4. పంచపన్నెల దీతిగా, దుర్జనులకు గుండె ఝల్ ఝల్ మనగా
అండపిండాండంబులకు బ్రహ్మాండగోళంబునకు నవ్వల
నుండి వెలుగు చుండు నిత్యాఖండ ఘనఘనుల బినుతింపగ ।జనని॥
5. ఇంపు సత్సంగమును, గేహ్వగజాలు, మందహాసముతోడను
కంచుమ్రోలయు పాలెపుంన మణిమండపంబున వెలసి భక్తుల
సంచితను రక్షింపవని పూనందపరవశయై రయంబున ।జనని ఈశ్వరీ॥

ఈశ్వరమ్మ – కందార్థం

వందనము సద్గురు శేఖర
వందనము అల్లాడుపల్లె దైవచిదంశా
వందనము సురభూసురనుత

దండము శ్రీపాతులూరి, దైవపరేణ్యా బ్రహ్మభిఖ్యభక్తశరణ్యా
అండాండ పిండాండ బ్రహ్మాండముల కెల్ల
దండినావల వెల్గా ఖండస్వరూపయో, దైవవరేణ్యా ।బ్ర
వందనము భక్తవందిత
వందనము దయాపయోధి వరదాయక నా

చక్రవర్తులు పదవి బాసిరి, రాజాధిరాజులు
గురుని వంచన కావించుచుండిరి ఋష్యాదులంతా
దిక్కు దెలియక యముని చేగిరి
నిక్కముగ మోక్షంబు జెందెడి నిలకడదియని బలుక నేరక
దక్కినట్లే మాటలాడి, దంభపు వాత్రులు నన్ను మాత్రాన ॥అడిగి॥
౩. నిరతముగ తాపత్రయంబుల మునిగి కన్ను మిన్ను గానక
పోరుచును విషయానుభవముల పొడిమెరుగక నరులు కొందరు
దురితముల బడి పొరలుచుండిరి దరిగానగలేక
నరకకూపమునందు పడుచుండిరి పరవస్తు తెలియక
మరల బుట్టుచు చచ్చుచుండిరి
పరమమౌనుడు (శ్రీ) పోతులూరి గురుడు వీరబ్రహ్మచరణ
సరసిజద్వయ మంటజాలక, దరియు దారియు లేనివారికి ॥అడి॥
వ॥ అని యీ విధంబున యీశ్వరమ్మగారు సెలవిచ్చు సమయంబున
పూర్వజన్మోపదేశ ఫలంబున దూరదేశ సిద్ధయ్య హెచ్చరిక జెంది
నవాబై నమస్కరించి యిట్లనియె

సిద్దప్ప ఈశ్వరమ్మగారల దరువు - మధ్యమావతి రాగం

సిద్ధ॥ జననీ (శ్రీ) ముక్తిద యీశ్వరమ్మ నను దుర్జనుడని తలపకుమమ్మ
వరుసగ నీపాద వనజాతములు నాహృ
ద్వజపీఠంబున నునిచి పూజించెద
ననుదినంబును దినకరునికై వనజ సంఘము కోరినట్లుగ
ననుబ్రోవ దేహేంద్రియాదుల నిర్వాణము గావించి వేడితి ॥జననీ॥
ఈశ్వ॥ సాధువర్తన సుజ్ఞానము సిద్ధా సచ్చిదానంద ప్రభావము
మోదముచే గురుబోధాత్ముడై మత భేదము నొంది
దుర్వాదము సేయక
సాధకంబు వహించి త్రివిధ ప్రసాద ధన్యుండౌచు పూర్ణ స
మాధిసిద్ధను జెంది తన్మయుడగుచు నాచిన్మయుడు గావలె ॥సాధిం॥
సిద్ధ॥ ఏదారి తెలియనివాడ నన్నాదరింపుము దయతోడ
యేదారిజూపినయీశ్వరీ! నీరసనాదమునంబున నమ్మియున్నవాడ
ఆదరంబున జూచి ఘోర లనాది మూలము దెల్పు మాయమ

పాదువిడ దెగగోసి వేయుడి. పాదములు విమవంగజాలను ।జన।

ఈశ్వ। నిరత ప్రకాశముజూడ సిద్ధా! నిజసన్నుహితము జూపుడాడ నిరవిగ
కడియాల పీవ్వూరియాచార్య వరమధైన శిర ప్రసన్నము ఘనపాద
స్మరణచేయుచు నాశ్రయింపుము కరుణగలుగను వారిచే, సుస్థిర
పదార్థంబైన జీవనమును ఘటించి ఘనుడవౌదవు ।సా।

క। అని చెప్పి మరియు నీశ్వరి
మనమున హర్షము చెలంగ మధురాన్వితముల్
దనరగ నిట్లనియెను యో
ఘనపుణ్య చరిత్ర సర్వకళలపలవిత్రా!

చ। వరగుణశీల! నాదు ఘనవాక్యము మోఘము గాన వింటివా
పరమ రహస్యమౌ నిదియు బట్టబయల్ సరిలేనిదీమహా
స్ఫురిత నిరామయంబు పరిపూర్ణము నామకళావిసర్జితం
బరుదుగ మ్రొక్కి వేడిన మహాత్ములు చెల్వరదెంత వేడినన్

కీర్తన మధ్యమావతి రాగం - అటతాళం

1. పట్టిమాటల ముక్తిలేదూ, యోగ, దృష్టిచే జూడగరాదూ గట్టిగ
గురుని చేపట్టి షడ్వర్గము, నెట్టివేచర పూర్ణదృష్టినూచినగాని ।పట్టి
2. విద్యాలు చేర్చినలేదు బ్రహ్మవిద్య తెలియక బోధగాదు సుద్దులు
మాని నిబద్ధిగ గురుపాద, పద్మములను నిర్మ సన్నిద్రములై తెగాని ।వ।
3. నాదము వీనుల వినుచు, మోద, ఖేదాము సమముగానుచు ఖేద
వాదములను పోదోలి సద్గురు, బోధనంది జ్ఞానయోగులైనగాని ।వ
4. సంశయంబులనెల్ల మాని, పరమ హంసావె మార్గము బూని
హింసలు జేయక హంసోహ మనుచును సంసారమందు నిస్సంగు
లయితేగాని ।వ
6. ధరణిభోగల సోతులూరి, వీర, గురుమ దెల్పిన యిట్టిదాని
పరము దెలుసుకొని పరిపూర్ణ భావము కరుణజెంది మోక్ష
కాములయితేగాని

కథను తెలుపు ద్విపద

ద్వి। అవు డమ్మహాదేవి యగు నీశ్వరమ్మ - ఉపమానమగు యుక్తు
లూహించి - పిదప - సిద్ధుండు తామన స్సిద్ధుండు నగుచు - బుద్ధి

ఘోరదుఃఖసంసారవార్ధి దరిజేరు సన్మార్గమున ధన్యుని జేసిరార్యులూ

బ్రహ్మంగారినిగూర్చిన మాట

1. శ్రీగురుని మాటపమున సేవజేయుచుండువారు
ఆగామి కథలెల్ల దెలిసియూ ఓరి సిద్ధయ్యా
త్యాగభోగ యోగ్యులైనారు - ఓరోరి సిద్ధా
రాగరహిత భోగులైనారూ...

2. నిత్యానిత్య వస్తువివేక వైరాగ్యాసక్తులై యున్న
సత్యజ్ఞానానందులౌదురు ఓరి సిద్ధయ్యా
సత్యమే పరబ్రహ్మ మందురు ఓరోరి సిద్ధా
నిత్యమే పరవస్తు వందురూ

3. హింసలెల్ల యెడము జేసి యీర్ష్యడంబాసూయాదుల
ధ్వంసము జేసిన వారలు ఓరి సిద్ధయ్యా
హంసోహంసు ధ్యానశీలురు ఓరోరి సిద్ధా -
హంస పరమ...హంసులయినారు

4 శ్రీ విరాట్ పోతులూరి శ్రీ వీరబ్రహ్మము పాద
సేవజేయుచుట్టి వారలూ ఓరి సిద్ధయ్యా
భాషాభాషా తీతులయినారు ఓరోరి సిద్ధా
సావధాన పరులయి యున్నారు...

బ్రహ్మంగారు - ద్విపద

ద్వి॥ వినరోరి సిద్ధ నే వినిపింతు నింక - తను వింద్రియములు నుద్ధతి
చిక్కబట్టి కొన్నియోగాదులు యోగి కోటిక వెలసె - వినుపింపు మది
లెస్స వేడ్క రంజిల్ల - అందుకు పరమేశు నాజ్ఞ నేరీతి జెందియుం
డునో మీద జెప్పెదగాని - సందేహ పడనేల సత్యవాక్యముల -
ముందు భక్తాదులింపుగా నసేకులును పరితాప మగ్నులయి బహు
ఘోరమైన ధర దేవతతికెల్ల తప్పక బ్రొక్కి-దారుశిలారూప తతి
కినర్చించి బారి తెలియక పెడదారులు త్రొక్కి - విపినాంతరంబుల
విహరించి గుహల - జపతపస్వాధ్యాయ చర్యలవలన జడల గట్టిగ
జుట్టి జపమాలబట్టి యొడల బ్రియుంబక బూవ్పుగాపూసీ - కాషాయ
ధారులయు కడ తేరునటి వేషంబులవిగాక విసిగియుండుటయు - నీరీతి

నుండును యిక నీతలంపు - యేరీతి నుండునో యెఱుంగ తెల్పుమని తెలిసియున్నది మాకు దివ్యదృష్టిచేత - పల్కవలెను నీనోట బలు కంగనేల - వివిధిగా కడియాల పిల్పూరివరాఖ్య పురమందునై కమ వాంఛ దీర్చెదను.

చ॥ అనుచును నాగుమూర్తముడు నప్పటి సిద్ధుని పాదపద్మకోర్కె ప త్యనుపమ సత్కృపామతిని నప్పుడనుగ్రహదృష్టి దోప నీ ట్లనియెను-ఓరీ! శిష్యుడనటంచివి పూర్వమునందు నే దినం బున ననుజేరితో యదియు మూలము చెప్పుము నిశ్చయంబుగన్.

సిద్ధుడు సీసపద్యము

శ్రీ విరాట్ పోతులూర్వీర యోగీంద్ర నా
పూర్వవృత్తాంత మిప్పుడు వచింతు
బనగాని పల్లెలోపలను వసించి వీ
రప్పయాచార్యులయి మెప్పుగాను
న్యాయమార్గమున నన్నాజయ్యగారికి
కరుణ కాలజ్ఞాన సరణిమీర
నుపదేశ మొనరించుచుండు నత్తరిచే
వెంకటరెడ్డినై వెలయుచుండి
గోవు గర్భంబు జీలిచి కోడెగాంచ
కోపపడి గోవు బ్రతికించి కోరశదీర
నన్ను పింజారి వారింట తిన్నగాను
జన్మమెత్తు మటంటిరి సఫలమయ్యె॥

ద్వి॥ అంతట మీదు మహాత్మ్యంబు తెలిసి - చింతమైయోచి సద్విధమైన బుద్ధి - తెలిసి నే కలగన్న తెరవున జూచి పలుమారు శుశ్రూష భక్తిచే జేయ - తాము కటాక్షించి దగ్గరబిలిచి - ప్రేమాతిశయ ముచే ప్రియము రెట్టింప - బోధింపుచుండి యాపురములో నూని సాధించి తెమ్మన్న నగము రేవేళ-ఆనూనెకై నేను నతిరయంబునను వూని తేబోవగా పురవీధిలోన - కానరాకానాక కాల సర్పంబు మానుగా కాదంట మహిమీద వాలి-దేహంబు తెలియక కాటిరు మూర్ఛిల్లి - యూహ నెరుంగక యున్నంతలోన - మరణాంతమై

అరమరసేయంగవలదు, ఆర్తశరణ్యా. కరుణించవో, యప్పాశరణ్యా
మతి హీనకులుడని మది నెంచితివిగాని
పాలించ గాదటన్నా - అభయ మివ్వక నార్తశరణ్యా

బ్రహ్మంగారు కందార్థం

సిద్ధుడ వినరా నీవు ప్ర
సిద్ధుడవేగాని, నీకు శ్రీమతకగుణాన్
వద్దిక సిడబాదన నీ
బుద్ధిని వినగోరి చూడ బుద్ధిమంతుడవు లోకములో, ప్రసిద్ధి
వంతుడవు
బుద్ధిహీనులమైనా దిద్దీర్చెదము మా
వద్దకు జేరిన వదలి పెట్టము యింక, బుద్ధిమంతుడవూ

వ॥ అని యివ్విధంబున శ్రీమద్విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వాములవారు తన ప్రియశిష్యుండైన దూదేకులసిద్ధునికి హస్తమస్తక సంయోగంబు గావించి పంచాక్షరీ మంత్రోపదేశంబొనరించి బోధ మార్గంబుదెలిపి అభ్యాసనిధానం బలపరచి సాధనాక్రమంబెఱిగించు చుండెను. అంత నొకనాడు సిద్దయ్యస్వామీ! కులమనగానేమి? అది యెట్లుకలిగెను? వాటి వృత్తాంతము జెప్పుమనగా, శ్రీ విరాట్ వీరబ్రహ్మేంద్రస్వాములవారు చెప్పుచున్నారు. ఎట్లంటే—

బ్రహ్మంగారు దరువు - శుద్ధకాంభోజి - ఆట

1 కులమేమికనగాజీవులలోపలను లేదు। కులమును తెలుసుకోవె సిద్ధా
కులమేమి కారణము, గుణమే కారణముగా
2 హరి, కూర్మకిటి మీన, నరసింహులుగబుట్టె
నతని నక్కులమేమి సిద్ధా!
పురహరుడు శాశ్వతుడు పుట్టు చోటెక్కడ
గురు తెరుగవా నీవె సిద్ధా!
3 సురభూరుహంబులు సుధయు మున్నీటిలో
హరిరాణితో బుట్టె సిద్ధా!
గిరిరాజపుత్రియై మెరసె దాక్షాయణి

అరయ నే కల వహాను ! సిద్ధా !

4, కుముదమిత్రుడు నూడ కొమరొప్ప కడలికి
కొమరుడై పుట్టడా సిద్ధా !
సుమశరుడు మనసు కా కొమరుడు చెల్లుకా
భ్రమియించ బుట్టడా ! సిద్ధా !

5. భ్రమదీర గా పీరభద్రుండు జడ మీద, ప్రభవించడా ! యెన్న సిద్ధా
రమణియా సర్ప గర్భమున జన్మించడా
రహీనాది శేషుడు సిద్ధా !

6. అల యజ్ఞ దత్తుండు, ఆ శూద్ర వైశ్యులకు
యిలలో జన్మించెను సిద్ధా !
వెలయుంగ ధృతరాష్ట్ర పీర పాండవులానాడు
వెధవలు కనలేదా సిద్ధా !

7. అండమై మగడుండ, అన్యులకు ఆ కుంతి
పాండవుల గనలేదా సిద్ధా !
పండితుడు విదురుడు, బానిస కొడుకయ్యే
పల్కెనే కులమాను సిద్ధా !

8. ఒనర కపిలుడు చేవ, హూంతికి నారదుడు
ఉదయించె తొల్తునకు సిద్ధా !
శునికి శౌనకుడు నామునుడు మాండవ్యుడు
కప్పకు జన్మించె సిద్ధా !

9. ధీరులెన్నరు కులము, తేడాలు ధరణిలో
నా గూఢిగ, నమ్ము సిద్ధా !
కారణాతీతు డోంకారమ్యుం డొక్క
ఘన పరాత్పరమూర్తి ! సిద్ధా !

వ. ఇట్లు చెప్పినవాడై, యాధ్యాత్మిక తత్త్వ క్రమంబెల్ల నెఱిగించి కాల క్రమాను సరణి సమాధినిష్ఠాగరిష్ఠత్వంబున నుండవలయును గనుక నిప్పుడు దేవదారి కుసుమంబులు, పండ్లు తీసుకరమ్మని సెలవిచ్చిన నాతండు దేవతలకు సుజ్ఞానమును దాగిజూపిన దేవదారిపండ్లున్నూ, వాడని పుష్పములున్నూ, తెచ్చుటకొరకు శ్రద్ధా భక్తిపూర్వకం

కొటుకకొండగట్లనడుమ బల్, ధాటిగ గస్పట్టునాం జూచుకొని ॥ఏ॥

2. తడవుసేయువలదె మనసా దారియంను గలదే
తడవుసేయకను ధాటిమీరగను కడెయెడముల తపబడకను వడిగా
నడినాళంబున నాగకన్యకను అమఁగులోను నడుగుఁ చునుపడగా ॥నే॥

3. అనుమాన మికేల సద్గురునాత్మ నమ్మిచాల
కనవలె వినవలె మనవలె సాధన మనసులోని నిర్మలతను వీడక
కనుగొని యమునా గంగా సారస్వతుల సంగమున వంలెడి
చోటున ॥యేటి॥

4. అందియుండకుండా ఆత్మానంద మొదవియుండూ
అందు యింపులకు నాధారంబై ఆంబరకిని తానగ్రభాగమై
ఓందునాదముల భేదమెరుంగక సుంచరాగిమైపూరణచోద్యమూ॥ఏ॥

5. సూరిజనంబులకు యిది కడు సులభమూ లోకులకు
ఆరుచక్రముల కాధారంబై మేరుశిఖర సామీప్యంబై జలపూరిత
మగు నోంకారంబై యతుల వీరగురుని పదనీరజసేనకు ॥ఏ॥

వ॥ అను సిద్ధయ్యకు మహా ప్రవాహంబు దారిజూపుచున్న దత్కాలం
బున దేశికాచార్యుడైన సద్గురు పాదపద్మంబు లాత్మగతంబున
ధ్యానింపుచు నిట్లని ప్రార్థించెను.

కం. ఎవ్వడు మూర్తిత్రయమున
కవ్వల పరమాత్మ రూపమై నిర్గుణుడై
నెవ్వడు సర్వమయుండా
నవ్వేలుగే బ్రహ్మమనుచు నాత్మ దలంతున్

సిద్ధప్ప దరువు రాగము – అట

1. నమ్మివచ్చితినయ్య నాపాలిదైవము రమ్మని పిలువరా బ్రహ్మం
కమ్మియున్నది యడవి కారుచీకటి నెల్ల జమ్మనేయుర వీరబ్రహ్మం

2. సోనభూములయందు వానగురిపించితివి మీ సెట్లు నిలచురా బ్రహ్మం
మానితంబుగ నీదుమహిమ నెరుంగను జ్ఞానంబొసంగరా బ్రహ్మం

3. తేరకానివలెను యూరకుండిన నాకు యేవడ్డువచ్చెరా బ్రహ్మం
వేరుసేయక మీరు ధీరత్వ మచురించి దారిజూపర వీరబ్రహ్మం

4. ప్రొద్దెక్కి మధ్యాహ్న పొడయుండలోపల పోరు మెండాయెర బ్రహ్మం

వద్దనెవ్వరులేరు నాపోవుచున్నాను బుద్ధిసెప్పర వీరబ్రహ్మం॥
5. మెండుమృగములజూచి కొండలెక్కగలేక గండిలో జిక్కితి బ్రహ్మం
మెండమూవులరీతి నుండె నాకిచ్చట యుండలేనుర వీరబ్రహ్మం॥
6. ఇవి జన్మములతో హెచ్చైన జన్మంబు నెన్న నరజన్మమే బ్రహ్మం
చిన్నతనమునుండి సేవచే నమ్మియున్న సన్నెండేగద వీరబ్రహ్మం।
7. తండ్రిగర్భమునుండి తల్లిగర్భము జేరి తరువాత జన్మించి బ్రహ్మం
గండ్రతనము వీడి గడపిన నీసేవా కాలమెంతేర వీరబ్రహ్మం।
8. సాధకమందిన సాధుసిద్ధయ్యను ఖేదమిల్లేర బ్రహ్మం
బోధరూపకమై పూర్ణభావము దెల్పి బాధలూడ్చర వీరబ్రహ్మం
9. పరికింప నన్నిట్లు పరిశీలనము సేయ, భావించియున్నావ బ్రహ్మం
విరివిగ కడియాల వీపూరియాచార్య వినుతిలందెడి వీరబ్రహ్మం

దరువు — యమునాకల్యాణి అట

ఏమయ్యా నామనవి యేమాయెనయ్యా! నాద బ్రహ్మానంద
నా గురుస్వామి।

పల్లవి। కామాదిగుణముల ఖండించి పరతత్వ
సీమాము తెలిపేటి స్వామీ! రక్షింపవే ।యేమ
1. పిలచిన పలుకావు దెలియు మాటాడవు
కలసి మాటాడని కారణమేమయ్యా ।యేమ
2. కొండవంటిది యాశ గోడుగువంటిది నీడ
నీడను నన్నింక నిలుపగరాదా ।యేమయ్యా
3. చలము చేతన నన్ను జాజులు తెమ్మని
సొలసి సమాధిలో నిలచియున్నావా ।యేమయ్యా
4. నింగి సమానమై గంగా ప్రవాహము
రంగుగ యడ్డమై రాసియుదాయెను ।యేమయ్యా
5. తమచుట్టు దిరిగిన దయలేక నను వెట్టి
భ్రమల బెట్టవలంచి పలుకనే పలుకావు ।యేమయ్యా
6. వృక్షమొకటి యందు పక్షులు పదివేలు
వృక్షము విడచిన పక్షినైతి గదయ్యా ।యేమయ్యా
7. తల్లిదండ్రి గురుడు దైవము గన క

3 నాదమా నాయెడ, భేదమా, వాదభేదాతీతభక్తా
మోదనిత్యానంద వైభవ, భూజమా, ఘనసామ్రాజ్యమా !
4 పన్నగభూషా, తిన్నగా, కన్నతండ్రివటంచు మదిలో
నిన్నె నమ్మినుతించునాతో, పల్కవా, కరుణజిల్కవా!
5 నిరతమూ, మదిసం, భరితమూ, వరమహాశయ పోతులూరి
వంశజలనిధిసోమ నేనీ వాడనూ, పరులను వేడనూ-
6 భారమా, నాదగునేరమా, సూరిజనమందార శివ ఓం
కారమంత్రధారనిత్యని, రంజనా, పాపవిభంజనా !
7 కోరితీ నిన్నే జేరితీ ధారుణిన్ కడియాల శ్రీ వి
పూరియాఖ్యశరణ్య ! సద్గురురాగదే మోక్షా మీగదే ?
8 భక్తిచే కడునాసక్తిచే శక్తిముక్తు లొసంగు నిన్ను
రక్తిపూజ లొసర్చు నన్నిక జూడవా నిర్దయ వీడవా—

స్తోత్ర ప్రణాళిక - పున్నాగరాగం - చాపు

1 శ్రీ మహేశ్వరా నమోస్తుతే, మాంపాహి యా
శ్రితజనావనా ! నమోస్తుతే—
ధీమనమున నన్ను బ్రోవ, దిక్కునీవని నమ్మియుంటిని
స్వామినాయెడ కరుణరాదె శాంతదయాకర సుధీర శ్రీ

తేవారం। దేవదేవేశ యీశా! జగదీశా! దివ్యరూప ప్రకాశా
నమ్మియున్నాడసామీ! నాయందు, కరుణలేదయ్య దేవా
వేదవేదాంత వేద్యా! తత్వార్థ, విజయ భవభోగవైద్యా
శ్రీ విరాట్పోతులూరి వీరేశ చిత్కళాకార శౌరీ—

పంచచామరం రక్షరక్షపాహిమాం సురక్షితాఖిలా శ్రితా
లక్షితాష్టసిద్ధిమత్కళా విలాసభాసురా
అక్షయాగ మార్దవన్మహోదయార్ద్రి మానసా
శిక్షితారిసంచయా! విశిష్టయోగకౌశలా
ఓంమద్గురు వీరనారాయణం భజే ..

2 భూరిసత్కృపావయోనిధీ! వందనము వంచ
భూతనిగ్రహా! శుభాకృతే
ఘోరహారభక్తమం, దారతారకా సుకీర్తి

సారసద్విచారకహూ, పారసత్సుధాకరా

తేవారం। భానుకోటి ప్రకాశా, భానుహోల్లాసయీశా

నిన్ను ప్రార్థింపుచుంటి నన్నేలు కొమ్మనంటి

నాతండ్రి నిన్నునమ్మి, నాడ నన్నేలుకొమ్మి

శ్రీ పోతులూరి రాయ చిద్రూపబుధవికాశా।

పంచచామరం। పరాత్పరాంశచే సమస్తభక్తులర్చనసేయగా

మొరాలకించి సంతతంబు మోక్షమిచ్చు వాడవా

విరాట్ స్వరూప పోతులూరి వీర దేశికోత్తమా

నిరామయ ప్రభాప్రధాన నిన్ను నమ్మితిన్ గదా!

ఓంనమశ్శ్రీ పోతులూరి వీరబ్రహ్మణే

3 భక్తజన సుఖ ప్రదాయకా, అష్టాంగి యోగ

భద్రముద్ర సంవిధాయకా

రక్తిమీర మిమ్మునే నిరతంబు పూజసేయ

వ్యక్తిగలుగునంచు నమ్మితయ్య భూజనత్సుతా శ్రీ

తేవారం। నిర్మలజ్ఞానరూపా నిర్గుణోద్యత్కలాపా

కర్మసాక్షి స్వభావా, కరుణింపు దేవ దేవా

పరమాత్మ, భవవినాశా భవ్యసంగ్రహ నివేశా

పోతులూర్వీర గురుడా! భూతేశ పాపహరుడా

పంచచామరం। నిరంతరాగమ ప్రబోధ నిర్వికాల మోహహా

శరంబు నీ మహా ప్రభావగానముం బొనర్చుచున్

పురందరాది నిర్జరాళు పూజతాంఘ్రి పంకజా

నిరంతరంబు నా మొరంబునన్ దలంతు సద్గురూ!

ఓంకారమంత్ర నిలయాయనమః

4 ఘోరపాపం నిశిదివాకరా, ఓంకారమంత్ర

పూరితా । సదా సుభాకరా

ఘోరకర్మలవాటపేకుతార నైగమ ప్రచార

చారు కందిమల్లపుర నిశాంత భవ్యదీవరా

తేవారం। అనుపమానంద భరితా, ఆదరింపగలేవా

దిక్కునీవయ్య నాకు, మ్రొక్కితిని వేగనీకు

నన్నేలు చిద్విలాసా, నారాయణాంశభాసా
అనుకంపజూడవేరా, అఖిలాగమ ప్రచారా

పంచచామరం। చండతాండవ ప్రచండ మండలాధినాయకా
ఖండరూప, కోటిభానుమండల ప్రదీపకా
జాండకోటినాయకా ఖండసౌఖ్యదాయకా
అండబాయజాల నన్ను దండిసాదరింపవే।
ఓం ఆదిమధ్యాంత రహితా యనమః

తే। గీ। ఈ విధంబున సిద్ధుడు హేమపూర్ణ
ప్రాణవాయువులా పరబ్రహ్మమునకు
తగ సమర్పణ సేయంగ దలచి, కరిని
చర్య లొనరింప నంత నాశ్చర్య మొదవ

వ। శ్రీ విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వాములవా రమందానంద తుందిల హృదయారవిందులై, ప్రాణాయామనిష్ఠా నిర్నిద్రుండైన సిద్ధునికి నిజస్వరూపంబున దర్శనంబి చ్చిన, మహానంద భరితుండయి సాష్టాంగదండ ప్రణామంబు లాచరించి, లేచి

తే।గీ। సిద్ధుడప్పుడు పరిపూర్ణ సిద్ధుడగుచు
గలిగె నేటికి భవదనుగ్రహసమృద్ధి
తెలివి నా యాత్మయందు సంశయము లుడిగె
తనుగుణంబున నొక కొరంతపడియె నరుడు

వ. అని యానంద పారవశ్యంబున నంతర్నిష్ఠ లక్షితుండయి

తత్వం — సుద్ధసావేరి — ఆదితాళం

నే జూచినానే, బ్రహ్మము నాలో, నే జూచినానే
నే జూచినానమ్మ నెలతారో, తారక
రాజయోగము నందు, రంజిల్లు నా గురుని ॥నేజూచి॥

1. కన్నుల నడుమను నన్నంపుదిడ్డిలో
తిన్నగ వెలిగేటి పున్నమచంద్రుని ॥నేజూచి॥

2. ఫాలభాగమునందు నీలజ్యోతుల నడుమ
నోలలాడుచున్న యుదులింగమూర్తిని ॥నేజూచి॥

3. చూపులలోపల పాపల నడుమను

వ్యాపించి వెలిగేటి యాపరంజ్యోతిని ॥నేజూచి

4. చక్షుః ప్రియంగా సాక్షాత్కరింపుచు
నిక్షేపమై వెల్గు సాక్షీభూతుని నాలో ॥నేజూచి

5. చందమామకు నడుమ సుందరాకృతితో నా
సందముగను వెలుగు హరి పోతులూరిను నే

వ. ఇట్లానంద తాండవంబొసర్చు సిద్ధుని యెదుట సాక్షాత్కరించిన శ్రీ విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వాములవా రభయ హస్తంబున నాతిని నివారింపుచు నిట్లనియె—

కాలజ్ఞానం — ద్విపద

ద్వి॥ వినర సిద్ధయ్య నీవేడిన యట్టి వినయవాక్యములకు వేడుకలొదవె బన్నుగా బనగానిపల్లెలో మున్ను-వీరభద్రుని కృపావీక్షణంబునను కారణంబునుబొంది ఘనతచెన్నొంది-ఘనత కాలజ్ఞాన గ్రంథంబొనర్చి అనువొందగా మున్ను నా గరిమరెడ్డి - వారింట దాచిన వార్తలు నిజము—కారణ కార్యముల్ కలియుగంబునను- ధర్మంబు దప్పి యధర్మంబు హెచ్చి - కర్మ సంకల్ప వికల్పంబు లమరు - దానికై యుత్పాత తతులెల్లగల్గి యుగ్ర నాకశక్తి యుఱ్ఱ్భటింపుచును-ధారుణీభారంబు తగదీర్పగలుగు - అదిగాక యింద్రకీలాద్రి దుర్గాంబ - కెదురుగా కలహంబు లేర్పాటులగును అచట నవాబుకు నతిరమ్యమయిన - బ్రచురమా కోట సంభ్రమలీల నమరు రూం పాదుషావచ్చి రూఢిగా కదన - కారులయిన సమబలకంఫిణీ దొరలు మందుగుండు సమేత మరఫిరంగీలు - సందడి గజతురగ సంఘంబు నడువ - రణగుణ ధ్వనులచే రాజ్యమంతియును-వణకుచు రక్తప్రవాహంబుచూచి-భీతాహపడి నదుల్ బెదరి మూర్ఛిల్ల - అతీరుగా కొంత హాతము నొందెదరు - పిలసిల్లి యాకృష్ణవేణి యుప్పొంగి గంగాతరంగ సంగత మహోత్తుంగ - భంగంబులై నింగి భాగంబు ముట్టి-తరిమిడి ఘోరయుద్ధమును గావింప - నరశవంబుల దిన నానాగ్రహములు - ఘోరపిశాచముల్ ఘూర్ణిల్లుచుండి - యీ రీతిగా యున్న గేంద్రంబు చెంతి - ధరణీపతులు కొంత ధరణిష్టై గూల ఘనుడయిన వీరభోగ వసంతరాయ - లనురాజు ధారుణీ

భూరి వీరాళయోదారునకు, హారునకు
ధీరుడౌ శ్రీ పోతులూరి వారికీ ||జయమంగళం||

5. నాదస్వరూపిణికి, వేదనిజభాషణికి
సాదరాన్వేషణికి, జగదంబకూ
వాదభేదములన్ని పోదోలి సజ్జనుల
నాదరించెడి యీశ్వరమ్మకిపుడూ ||జయమంగళం||

6. ప్రణవాక్షరికి ఝుణం ఝుణ రవోత్కట నుకం
కణ పాణికిని నీలఘనవేణికి
గణనీయ బెజవాడ కనకదుర్గాంబకును
అణిమాది వరద యక్షీణఘృణికి ||జయమంగళం||

గ్రంథ రచనా కాలము

సీ। పరిమి వీరాచార్యు లరుదుగా శ్రీవీర
గురుకటాక్షం బాత్మ గోరి ధాత్రి
పుణ్యగాధలచేత ప్రొద్దులు పుచ్చుచు
విఖ్యాతి మీరంగ వికృతినామ
సంవత్సరమున, పుష్యసిత త్రయోదశి
గురువాసరంబున కోర్కెమీర
మేటి వీరబ్రహ్మ నాటకాలంకార
సాహిత్య మొసరింప, సత్కవీంద్రు
లైన వీపూరయాచార్యు నాశ్రయించి
పూర్తిచేయించె నీరోజు బుధులు నాత్మ
సంతసమునొంద, సత్కీర్తి వంతుడగుచు
పరము నార్జించె, సామ్రాజ్య పదవిగాంచె

శ్రీ

—గ్రంథావతార కథనము—

ద్విపద। శ్రీ వీర బ్రహ్మాండ సృష్టికారణుడు – సాకారభావుడు సజ్జనుల
దీపకుండు – కారణాతీతు డోంకార గమ్యుండు – మేరు భూగోళ
నిర్మిత సుధీరుడు – మూర్తిత్రయైక సంపూజ్యుండు లోక
కర్తయా శ్రీ విశ్వకర్మ కులాబ్ధి – చంద్రుండు ఘనతరాచారుండు

ద్విపద। సుగుణ - సాంద్రుడౌ ఘనుడు కాశ్యప గోత్రభవుడు - పరిమి
వంశాబ్ధి శుపాకరమూర్తి గురులింగయాచార్య పరధర్మపత్ని
సుబ్బమాంబికయందు సుతు దుద్భవించె - దబ్బరలేని యుత్త
మ గుణాన్వితుడు - రాజార్ధధరుని వరప్రసాదుండు - భూజన
వినుతుండు వ్రతవర్తనుడు - అనఘాత్ముడయిన వీరాచార్యు
డొక్క - దినమున నిట్లు బుద్ధిని యూహజేసె - జగతి వీర
బ్రహ్మ చరితంబుజూడ - నిగమాంతసిధి, యద్దినిఖిలవేద్యముగ
భువిలోన నాటకంబుగ నున్న మేలు - భవరోగహారమని భక్తి
యుక్తుడయి - చని వేడ్కచే కొండశంకరకవికి - మనవిచేసిన
గొంతమట్టుకు - వారి వలన నేర్పడె నది భక్తి లేకున్న-దల
పోసి, కాలంబు దాటిపోవుటకు - మనసులో గుంది బ్రహ్మము
నాత్మసెంచి - మనుజుని దీక్షకు మాకుండదనుచు - సంతసం
బుగను నానంగతి కొంత - తలపురా నటనుండ తిరలినిన్
కొండ - సీమను పొట్లూరు చేరి నాతోడ - క్షేమసంగతులెల్ల
జెప్పి యీ చరిత - పూర్తి చేయుమటన్న పూని యాచార్య -
మూర్తి సత్కృప నిది ముదముతోజేయ - జాలితి నాదువంశ
విధంబు సిరుల - గ్రాలు శ్రీ మద్విశ్వకర్మాన్వయుండు - పస
మీరు కాశ్యప ప్రథితగోత్రుండు - వసుమతి కడియాల వంశ
వర్ధనుడు -మల్లయాచార్యుండు మహితసత్కీర్తి నెల్ల సంపదలచె
సెలమి జీవించు - నతనికి పత్ని మహాలక్ష్మి యనగ - వ్రతు
లయిన యా వధూవరులకు సుతుడ - శ్రీపరమేశ్వర సేవాభిర
తిని- సేపారు బుధవర్గ హితుడ, వీపూరి - యాచార్యుడను
సంస్కృతాంధ్ర కవిత్వ సూచనదెలిసి సే సుజనావళి మెచ్చ -
పరహిత చరితంబు భక్తిరసంబు - పరమపవిత్రంబు పావత్వ
యంబు సదమలంబని - యీ రచన జేసినాడ - నిది విన్న
వ్రాసిన నిష్టభోగములు - చదివి సుజ్ఞాన సంపత్కరంబు -
సదయాత్ములకు నెల్ల సరిలేని భోగ- భాగ్య సంపదలను బహు
కత్వసేర్చి యోగ్యత పరతత్వ యోగంబు గూర్చు!

కందార్థము

శ్రీ వీర బ్రహ్మ చరణ
సేవిత మానసుడనగుచు జెప్పితి దీనిన్
ధీవరులు దోసము లెన్నక
భావములో మెచ్చుకొనుడు, పండితులారా
జీవేశ్వరా ఖండజ్ఞులారా !
కేవల భక్తినతి ప్రియుతో లిఖించిన
దేవ దేవుండిచ్చు దివ్య వరంబులు, ధీమంతులారా !

## కాలజ్ఞానము _ తత్వము

1. చెప్పలేదంటనక పోయ్యేరు – నరులారా గురుని – చేరి మ్రొక్కితే బ్రతుక నేర్చేరు – చెప్పలేదంటనక పోయ్యేరు – తప్పదిదుగో గురుని వాక్యము – తప్పుత్రోవల బోవువారల చప్పరించి మింగు శక్తులు ।చెప్ప।
2. మొప్పెతనమున మోసపోయ్యేరు యిదిగాక కొందరు గొప్పతనమున గోనుమీరేరు – యిప్పుడప్పుడనగరాదు – యెప్పుడో యే వేళనో మరి – గుప్పున దాటిపోయ్యే గుర్రపడుగులు యేదుపడును ।చెప్ప।
3. తాకుతప్పులు దలచకున్నారు – తారాకాణమైతే – యొక్కువతో దెలియనేరారు – జోకపోడుత తల్లిపిల్లలు – జోడు బాసి అడవులందు కాకిశోకము జేసి ప్రజలు – కాయుకి నరులు నమిలిచత్తురు ।చెప్ప।
4. కేక వేసి ప్రాణమిడచేరు – రాకాసిమూకలు – కాకబట్టి కలువరించేరు – ఆకాశము యెర్రనవును – ఆరు మతములు వక్కటవును – లోకమందు జనులు అందరు – నీరు అగ్నిలో మునిగిపోదురు ।చెప్ప।
5. అగలు – విడిచిపోగలు దాటేరు – యిదిగాక పట్ట – పగలు చుక్కలు జూచి భ్రమసేరు – భుగులు భుగులు ధ్వనులు మింటను – పుట్టిపోయిన పిమ్మటను – దిగులు పడుచు ప్రజలు చాల దిక్కులేని పక్షులౌదురు ।చెప్ప।
6. పాతకాలు పదటగలసేరు – పుణ్యాత్ములైన సాధకులు సంతసింతురు – భూమిమీద ధూమధామములు పుట్టిపోయిన పిమ్మటను – రామరామ అనినవారలు రాలిపోదురు తెలిసికోండీ ।చెప్ప।
7. యేమెుపెమె మొనగకున్నారు – యెందెందు జూచిన యముని

పురి కేనడువమందూరు - భూతలమున నిట్టివింతలు, పుట్టి అణగిన పిమ్మటను - నీతికృతయుగ ధర్మమప్పుడు - నిజము నిలకడ మీద దెలియును ।చెప్ప।

3. ముందు వెనుకను గానకున్నారు-మూర్ఖులై భువిలో ముందుగతియు గానకున్నారు-కందువాతో పిన్న పెద్దలు కన్నుగానక గర్వము లచే మందెమేలములాడు వారిని-బందుబందు గగోతురక్కడ ।చెప్ప।

9. కీడుమైన నుకూడదందూరు - వనగూడినప్పుడు, యేడజూచిన వాడు కొందూరు వేడుకతో పోతులూరి వీరభోగవసంతరాయలు యేడు దీవులు యేకచక్రము యేలును బ్రహ్మాండమంతయు ।చెప్ప।

తత్వము

1. కారణమొకటి దెలిపెదవినుడి ఘనబుధజనసంఘములారా - దారుణిలోనిదిజరుగుయ మోఘము - ధర్మగుణోన్నతపరులారా - అయిదు వేలసంవత్సరములపై మహావదలు గలుగును నరులకునూ ।కారన।

2. కలియుగమునగల కర్మలెల్లను - హరియించును తప్పక వినుడి - స్థిరముగ మముపూజించిన వారికి-శిరిగల్గునునిజమదిగనుడి ।కారణ।

3. వన్నెలత్కుగుర్రములునడువగను - ననుమతి తలక్రిందౌ నిజమూ-పన్నగగజముల బారులద్రొక్కిడివట్టిగ్రమ్ము భూరజమూ ।గారణ।

4. నమ్ముడీకృష్ణానదితీరంబున - నరకలాటనిజమహాచూడు - క్రమ్మిన బలములుకత్తులపాలౌ - గాంచిపిల్వ నొక్కడులేడు ।కారణ।

5. ఏడువుట్లనల్లలు వక ఘడియలో - యిలపై రాలునుతప్పకనూ-కోడెగాండ్రదు రణభూమిలోపల - కూలెదరెవరికి జెప్పకనూ ।కారణ।

5. వరపుణ్యులుద్భక్తులు నీచులవలన కష్టములనొందెదరు - స్థిరముగవారల కోపానమున - అరుదుగ భస్మంబయ్యెదరు ।కారణ।

7. నరసత సద్గురు శ్రీ సద్రుదవన - సారసముల నెంచితిని - అరుదుగ వీరబ్రహ్మస్వాముముున అవని సమాధిని జెందెదనూ ।కారణ।

ఓం తత్సత్

ఓమ్

# శ్రీ కాలజ్ఞానము గోవిందవాక్యములు

శివగోవింద గోవింద - హరిగోవింద గోవింద

1. గోవిందుడనగాను భావించిచూచితే - ఆనందబ్రహ్మమందాడగనూ
ఏమందునేసింక భామునుండీముందాగ-ఆనందముగసిందాడితిరా ॥శి॥ హ

2. మేషరాశిలో శని ప్రవేశమయితేను _ మేలుకొందరికి అయ్యానిమ
దోషకారులెల్లఘోరులనుఘోయ్యేరు ధూమకేతువులుమింటబుట్టినిమా

3. యిమ్మహిలో బహుధాన్యవత్సరమంద- నేక వుత్పాతాలుగల్గినిమ
యెమ్మెకర్మాలకుచింతలుబుట్టిని దుర్మదించిననరులు సమసేరుమా

4. కల్లలాడెవార్కి నిర్రుగానుగలలో-మళ్ళించి పొర్లించి గూల్చేరుమ
తొల్లి ఛండికదేవి శనివద్దజేరించి-కల్లయుగమున వింతగలిగీనిమా

5. ముదుపు వెంకటప్ప వుత్సాహమయ్యాని ముదుపులు తిరుమలకు
నడచీనిమా
కడపవద్దయున్న కమలాపురములో-కప్ప కోడికూతగూసీనిమా

6. జాతిజాతికే చాలవైరముల్ గలిగీని-జనయోగము తల్లడిల్లినిమ
పెన్నయొడ్డునయున్న చెన్నూరు గ్రామము - వరదల పాలయి
పోయ్యానిమా

7. ఈశాన్యమునుండి విషగాలివచ్చీని విపరీతనరులంతజచ్చేరుమ
పటకిరాతకుల ఖండించివేయును కలికావతారుడు వచ్చీనిమా

8. పొగరుబోతులంత భవిష్యమంతయు-బూటకమనిపల్కు- చుండేరుమ
కాగలకార్యముల్ కనురెప్పపాటులో-జాగులేక వేగజరగేనుమా

9. భారతభూమిని పరిపాలనజేయ-పరదేశవాసులు వచ్చేరుమ
అరువదివత్సరంబులు యొకరీతిగా-అంబయొక్కటై అవనినివలేనుమా

10 విశ్వంబులో విశ్వనాధావధూత యను-విశ్వబ్రాహ్మణు డొక్కడు
బుట్టేనుమా
విశ్వంబులో తాను శాశ్వతంబుగనుండె విశ్వనాథుడనిన పల్కేనుమ

11 భూతలంబున శేవల్లిమూలయందు-ఈత చెట్టుకుపూజల్ చేసేరుమ
భూతపార్థివమధ్య దేశాధిపతులెల్ల పాతకంబగుయుద్ధముల్ జేసేరుమ

12 ఉల్లిగడ్డలకు ఉపదేశమిచ్చేటి - కల్లగురువులు కలిలో వుండేరుమ
కల్లగురువుల నెల్లకాలదన్నును యముడు కల్లలేనివార్ని గాచేనుమా
13 అయిదువేల నాల్గువత్సరంబునను అవనీంద్రుడు అస్తమించేనుమా
అయిదువేలముప్పదారింటమీదట అమితముగ యుద్ధముల్ జరిగేనుమా
14 బాగుగ ఆనందవత్సరంబునను నాగుమల్లె నశియించేనుమా
నాగుమల్లెరీతి నరులంత జచ్చేటి రోగంబు ముందిక వచ్చేనుమా
15 బహుధాన్య విక్రమ వత్సరంబులలోన బహుగ యుద్ధములు
జరిగేనుమా
రాహుకేతులవలె రారాజులిద్దరు రణరంగమునకు కాలుదువ్వేనుమా
16 అయిదువేలమీద నన్ని రాజ్యములలో అమిత కష్టము
లనుభవించేరుమా
భావ యువల మధ్య పరరాష్ట్రములలోను బహు ప్రళయములు
గల్గియుండేనుమా
17 ఉత్తరదేశమున వైశ్యకులమునందు ఉత్తమగంధోళకుడు బుట్టేనుమా
హాత్తుగ నన్ని దేశంబుల వారంత సత్తుగ పూజలు జేసేరుమా
18 లోకమంతయును ఏకంబుగా జేసి ఏకుబట్టె వాడు వచ్చేనుమా
ప్రాకటంబుగను లోకంబులో తాను మేకై నిలిచి జనుల మేలెంచేనుమా
19 కోయరాజ్యంబంత గొడవలపాలౌను కోయనాయకుడతి కోపంబుతో
కువలయపతికి బల్ కష్టముల్ గల్గించి అవనిలో అదృశ్యుడయ్యానిమా
20 ఐదువేలమీద బహుధాన్యలోపల అన్ని జాతులు వక్కటయ్యానిమా
అవనిలోగల బీదధనవంతులొకటిగా అయ్యె రోగంగూడ వచ్చేనుమా
21 పల్నాటిసీమకు బాటసారొకడొచ్చి పల్నాటిద్రవ్యంబు దోసేనుమా
పల్నాటినరులంత పచ్చియాకింపయు నేకరీతిని మేసేగుమా
22 అయిదువేలః రెంటిలో నొక్క అవనీంద్రుడు దివి కేగేనుమా
హైదాపేటలో సాహెబులందరు సమరంబునందున సమసేనుమా
23 అద్దంకిసీమలో బదయాదవుకంట బుద్ధునంతటివాడు బుట్టేనుమా
యుద్ధరణముల కనేక భవిష్యత్తులు అయిదేండ్లప్రాయమున దెల్పేనుమా
24 దాసులు యోగులు ధరలోన దాగేరు మోసదాసుల్ యోగుల్
మించేరుమా

మీసాలు తెల్లనోడీ దేశానికొచ్చేను మహిమండలమున జండాలేసేనుమా ॥శి॥మా

25 దనుజనామ సంవత్సరమందున వాంతిభేదులచేత వాశేరుమ
హూణముఖులవంశమున కొంతబోయ్యాని కావిజాగనిభూమి
దోలిచేరుమా

26 ప్రభవపార్థివమధ్యపర దేశములన్ని బహుప్రళయంబులుగల్గియుండేనుమ।
ప్రభువీరవసంత రాయలొచ్చెడిలోగ ప్రళయములన్ని యుపండేనుమ

27 తల్లులబిడ్డల తగవులునడచీ తల్లడించెడినము లొచ్చెనుమ
కల్లగాదీమాట యుల్లముసాక్షిగ గద్దెనొడిచి కాకి తన్నీనుమా

28 బాపలకుపీటలుమాలపిఱుమంచాలుమహిలో వేసేడినములొచ్చేను మా
మధురతంజాపురాన సంహారణమయ్యేను మహానందిశిఖరము విరిగేనుమా

29 కాంచీపీఠంసాక్షి రెండూళ్ళనడుమను అగ్నివర్షములు గురిసేనుమ
పెంపుతో పదునాల్గుగ్రామాలు మంటచిభువివణకి గ్రామంబులదరేనుమా

30 నాల్గువేలయైన మన్నాటము ప్రవిపండ్లు కలియుగాబ్దులుజరిగేనుమా
కలియందు శ్వేతముఖులు దొరలయ్యేరు మెలకువతో రాజ్యంబు లేలేరుమ

31 శ్వేతముఖులఘూమశకటముల్ గల్పించి భూతలంబుననినుపకమ్ములపై
సూత్రమొనగి ఏశ్వమోత్తరాడశలంమ ఘూత్రముగా నడిపించేరుమా

32 ఆయలోహతామ్రనాగశకటముల పై ఆప్న జాతులొకటై అందులోను
స్వీయకులాచారముల్ దప్పి యొకరిపైనయొకరు బడియూళ్ళకురికేరుమ

33 ఐదువేలముప్పదెనిమిదింటిలో రాజు అవనివిడచి దివికేగేనుమ
ఆయురారోగ్యఐశ్వర్యహానికత్ఙీణమయ్యేయోగముజనులకొచ్చేనుమా

34 మబ్బునూయలబడి దబ్బరలాడేటి మబ్బుదతలు బహునడచేరుమ
గొబ్బుననావెల్ల నాశనమయ్యేరు గుణవంతులీభువిలో నిలిచేరుమా

35 ఏడుకోట్ల భూమండలములోను పొల్లుబోయిఘట్టి నిలచేనుమ
ఏడూళ్ళకొక యూరుప కాంతమయ్యానిన కాంగులు అరుదయ్యేరుమా

36 ముండమోపులెల్లముత్తైదులయ్యేరు ముందొచ్చేగతిమీరు తెలసేనుమ
బండాటలాడేటి పాపిష్టినరులంత పండాకురీతిగా రాలేరుమా

37 కుంభకోణమునందు గోవధజేసేరు కొల్లాపురముకొల్లబెట్టేరుమ
కంభముచెరువులోకలపొన్నబూచేను కందుకూర్లో చెరలుబెట్టేరుమా

38 ఆదవేణిలోనుకప్పకోడికూత అందరువినగను గూసేనుమ

మేదినిమీదను తాడిప త్రిలోను మేకమనిషిరూపమయ్యేనుమ ||శ్రీహ

39 మైనూరుసంకుండిమూరెమ్మవచ్చేను మాయవాదులబహుమింగేనుమ
దాస్యనరులకు తాపత్రయములేక తప్పక గురుసేవ జేసేరుమ

40 వావివరుసలేక పొయ్యానిజగములో వసుధలోవంటలు ఎండేనుమ
శ్రీయుతునిమతము సమకూర్చివచ్చేను సత్యవాదులుకొంద రుండేనుమ

41 కందనూరులోను స్త్రీ పురుషుడయ్యేను కలకోడితర్వాశగూసేనుమ
సందేహములేదు సామగానముచెవుల సకలమయిసవాడు వినివేరుమ

42 ఉత్తరాదిప్రజలు దక్షిణముఖులయ్యి ఉత్తరాయణమందువచ్చేరుమ
కత్తికత్తిపరచి ఘనయుద్ధమయ్యేను కలిభూదేవియు వణకేనుమ

43 ఉత్తరదేశమున నత్తుగ ప్రజలంత కత్తులతో వేట లాడేరుమ
ఉత్తమాటలుగావు నదినదములుపొంగి ఊళ్ళన్ని గొట్టుకపొయ్యేనుమ

44 కాలమువచ్చినదనుక నామాటలు కల్లలానిజనులు గూసేరుమ
కాలముమొదలా పాథానికొచ్చేను కల్లలెల్లనిజములయ్యేనుమా

45 శత్రుసంహారుల వెంటబెట్టుకొని శేషాద్రివాసుడు వచ్చేనుమ
గురువుదైవము రెండు లేదన్నవారిని గ్రుచ్చిఈటెమొనల గ్రుచ్చేరుమ

46 హంపిలోవుండేటి హనుమంతురాయుడు అరచివీధులకేక వేసేనుమ
ఆకేకుతగ్గబె మహానందిమూలంత ఆకురాలినట్లు రాలేనుమా

47 ఆకాశవీధిలో రాకాశిపంపులు కేకవేయుచును ధుము కేసుమ
చీకాకుపడియుంత జమతెలుజచ్చేరు శమనుని దూతలువచ్చేరుమా

48 అప్పులవారికి తిప్పలువచ్చేను సిప్పూల వర్షము గురిసేనుమ
అప్పుజేసినవారి తలద్రుంచివేసేరు ధర్మాత్ములను గారవించేరుమా

49 భార్గవత్సర భాద్రపదమునందు భక్తకోటినిబిల్వ నంపేరుమ
దుర్గాకస్నిట తోరణాలుగట్టి దుర్గను బసుపుసిమి వేసేరుమా

50 రామధర్మజులు సృష్టిభారముదీర్ప శృంగారమూర్తులై వచ్చేరుమ
ఘోరదురితములణగి కుంభినిమీదను పుష్పవర్షములు గురిసెనుమ

51 నిరూపాతకుండు దుర్గీమాట్లాడి వీరధర్మజుమాట జెప్పేనుమా
తిరువళ్ళూరు వీరరాఘవస్వామికి తిరుకల్యాణము జేసేరుమా

52 నందివల్లెలోన బసవనికడుపులో నగుపేరడకమ్మ లుండీనమ
మొదటియాకమ్మలో వార్త లెల్లనినిమూర్చిల్లిజనులంతజచ్చేరుమా

ముత్తలూరువద్దముందుగగూర్చుండిముగ్గురూ ముచ్చటలాడేరుమా
గుత్తిదుర్గము జేరిగురుపూజకాలాన కోటిద్రవ్యం దానమిచ్చేరుమ ॥శి హా
54 ఆనందగురువుల వెంటబెట్టుకొని అహోబిలానకు వచ్చేరుమా
ఆనందగురువుల అనుమతిచేతను అన్నవస్త్రంబులు ఇచ్చేరుమా
55 కంచిలో వుత్పాతాలుబుట్టేని గరుడధ్వజము గదలించేనుమా
పంచముఖబ్రహ్మపారుపత్యముపిడచిపరంజ్యోతిధ్యానమూ జేసేనుమ
56 పర్వతాన వుత్పాతాలుబుట్టేని పార్వతీచిరునవ్వు నవ్వేనుమ
పర్వశ్రావణమాస కృష్ణాష్టమికి పంచాగములేక పొయ్యేనుమా
57 కురుకొండలోనున్న హనుమంతరాయుడు కోపముచేతను పెరిగేనిమ
ధరణికినాలుగు త్రాటిప్రమాణులపొడవు నరులకంటికిగానుపించేనుమ
58 శ్రీతవఖ్యాతిలో కూతలుబుట్టేని పాతకోట పటల మయ్యేనుమ
ఆత్మకూరివారు అడవిపాలయ్యేరు మోతుకూరివారు మొరిగేరుమ
59 చెప్పన్న దేశాల ప్రజల జ్యేష్ఠశుద్ధవిజయ శలవిచ్చేరుమ
అప్పుడీప్రజలెల్ల యమలోకంజేరి అంతకునిచేత నొచ్చేరుమ
60 బంగారుపువ్వుల తలపాగజుట్టుక పన్నుకోకలుపైని గట్టేరుమ
మంగళాగిరి భానుమండలవాసుడు మహిమీద ప్రకాశమయ్యేనుమ
61 బదరికోటలోను ద్రవ్యముతీసేరు బెజవాడకు గొంచు బొయ్యేరుమ
బిజనూరుసీమంత బ్రాహ్మణులకిచ్చేరు బీదవారికి ధనములిచ్చేరుమ
62 ఛాగలమర్రిలో ద్రవ్యముదీసేరు చాటపెయ్యల జెండాడేరుమ
సాగరంబులమధ్య సప్తద్వీపములు సర్వోత్తముడువచ్చియేలేనుమ
63 మూలమ్మ ఆవృక్షాలో మూణ్ణాలువుండీని ముసిమదుగుదోపిళ్ళు బొయ్యేనుమ
పాలవాయివద్ద పణతులబట్టేరు పోటుగంటికిగొంచు బొయ్యేరుమ
64 శంకరాచార్యశ్రీనివాసులవాక్యాలుశాశ్వతంబుగ నడువబొయ్యేరుమ
శంకరునిసన్నిధిన విద్యారణ్యులవారి శాపనము సత్యముఅయ్యేను
65 రుద్రసీమలోవుండే రోదనమనుజులు రూపవిహీనులై పొయ్యేరుమ
రుద్రుడు కరుణాసముద్రుడు శ్రీవీరభద్రుడు భక్తులబ్రోచేను
66 భువిలోనమానవులు దుష్కర్ములైరాని దివిదేవేంద్రుడు బ్రహ్మ మునులునుమ

81 ధనుసుమీదగురుడు ప్రవేశమైతేను ధనువుచేతహరుడు బట్టెనుమ
మనసిజహరణుడు పాశుపతాస్త్రము మనవీరయోగికి యిచ్చేనుమా
82 ఎనిమిదిముద్దలుతొమ్మిదికాకాలు యమునితోడను దిరుగునుదర్శనంబు
కత్తిబట్టేవాడు వీరవసంతుడు కర్నాలచెండాడ వచ్చేనుమా
83 కుంభమందుగురుడు ప్రవేశమైతేను కుంభినికుదురుగ యుండేనుమ
శంభునినుమతిచేత శంఖుచక్రధరుడు శాంభవి పట్నాన్ని ఏలేనుమా
84 బిగుదైన పెనుగొండమీదను ముందర భేరీధ్వనివిన వచ్చేనుమ
కరములుపదహారు గల్గినకామిని గండికోటమీద తిరిగేనుమా
85 పంచానకులములో ప్రఖ్యాతిమయ్యేను పార్వతినేత్రముతోడుతనూ
పాశుపతాస్త్రము చేతబట్టుకొని పర్వాతంబుమేర జేరేనుమా
86 భాగవతములోను శుకయోగిపల్కిన భావికాలము దృష్టమయ్యేనుమ
మాఘబహుళ మందు మావారువచ్చేరు మహిమీదసంభ్రమములయ్యేనుమ
87 కన్యరాశిని శని ప్రవేశమైతేను కమలనాభుడుపయనమయ్యేనమ
కనకాగిరివద్ద కలహంబులయ్యేను కాంభోజునును దేవిబుట్టునమా
88 హేమాద్రిరజితాద్రి దక్కవాడముపల్లె రామధర్మజులు వచ్చేరుమ
హేమాద్రిహేమాలుగొలిచేరుముందర హేమబీటముమీద జేరేనుమ
89 పెనుకొండదుర్గమున్ను యిల్లుబయలుదేరి వీధులవెంబడి దిరిగేనుమ
సన్నజాజులవాన సాయంత్రమునందు శతమన్యుడు గురిపించేనుమా
90 ప్రేమతో వీరవసంతూనివెంబడి పెద్దలెల్లతర్లి వచ్చేరుమ
సోమసిద్ధాంతము బోధియ్యాని జగములో శోభనములు అయ్యేనుమ
91 కుండలీశయనుడు ఘోటకమునెక్కి శ్రీకూర్మగిరికేగ వచ్చేనుమ
కొండయ్యదాసుని శీఘ్రముగబంపి పెండ్లికొడుకుపిల్వనంపేరుమ
92 కూర్మగిరివద్ద గుడార్లువేయించి వీరుని పెండ్లిచట జేసేరు
కూర్మగిరికివేగ గంధర్వులువచ్చి నిర్మలగానము జేసేరుమ
93 కేశవునిపెండ్లి కీర్తిగజేసేరుమ ముత్యాలతలంబ్రాలు బోసేరుమ
కేశవునివశము దేశాలన్ని జేసి దేశాలవారికి వ్రాసేరుమా
84 ఈశ్వరవత్సర మాఘశుద్ధదశమి రోహిణి యిందు వారంబునా
సర్వేశ్వరునివశము దేశాలుజేసేరు దేశదేశములకు వ్రాసేరుమ
35 మకరకుంభములు మాసాలలోపల ప్రకటనప్రకాశమయ్యేనుమ

ప్రకటన జేసియు పలుమారు దెప్పిన ప్రజలు ప్రారబ్ధమున దెలియరుమ
96 ఉదయగిరీతుదనుమ్రిచెట్టుక్రింద నుద తేతు సలుపులతో బుట్టునుమ
సాధుజనులచూచిచూడగాబోయ్యేను భేదజనులబట్టి మ్రింగేనుమ
97 హంపీవిరూపాక్షి రెండూళ్ళనడుమను అరచిబసవుడు రంకెవేసేనుమ
విరూపాక్షివద్ద వీరంగవాద్యము మాటెమ్మగుళ్ళోను మ్రోగేనుమ
98 మూడుకోట్లము త్తైదువుల శాపము పొందరాపదహార మయ్యేనుమ
మూడుకోట్లము త్తైదువులు పురుషుల ముకుందునివెంట వచ్చేరుమా
99 రేవతికన్యక వెంట మూడుకోట్ల దేవకన్యలు వేగ వచ్చేరుమ
100 ఓరుగంటిలోను ప్రతాపరుద్రుడు వీరుడై బహుకేక వేసేనుమ
ఆరాడిదగ్గట్టే ఆపార్శ్వనరులెల్ల ఆకురాలినట్లు రాలేరుమ
101 శ్రీరంగపట్టణంచెన్న పట్టణమునుండిశీఘ్రముగ బ్రాహ్మణులు వచ్చేరుమ
వీరవసంతుని ప్రకాశవింతలు వెంకటాద్రిహరితో బల్కేరుమ
102 ఆరడాలుజెల్లులు పులితోలు గొడుగులుధరించిముందరనడిచేరుమ
మెరయుచూవీరవసంతుడై వచ్చేను ముత్యంచికన్నెల మొరలాలకింపగా
103 అల్లుతు పోరయితే ఆదికేశవులు అవనిగర్భమందు వుండేనుమ
కల్లియుగము పళువత్సరమందున ఘనుడుబయలు దేరి వచ్చేనుమ
104 నాలుగువేల తొంబన్నూటపదిదివత్సరంబులందు తెలిపేనుమ
వెలుగుచుభర్గునివత్సరమందున వీరయోగీంద్రుడొచ్చేనుమ
105 కల్లియుగము ఐదువేలేండ్లమీదట కలికిరూపుడు తరలివచ్చేనుమ
యెల్లలోకములు ఏలుచు చాతుర్యగముల ధర్మము నడిపేరుమ
106 లోకచుక్కలుబుట్టిదానివృత్తాంతము తూర్పుతెలపశ్చిమదిక్కుందునా
లోకశిరమున్న బండికల్లంతడిచుక్క పైశాల్యంబు యుండేనుమ
107 ఇరువదిబారల పొడవుతోకతోను పరులకండ్లకుగానుపించేనుమ
విరివిగా ముప్పదిమూడ్రోజులుండేను ఎరుగనిచోద్యాలు ఎరిగేరుమ
108 గగనమందునాల్గు ఎదురుగాచుక్కలు ప్రకాశతారలు బుట్టేనుమ
ప్రకాశతారలుచూచిన ప్రజలెల్ల దిగులొంద దరిపడి జచ్చేరుమ
109 శ్రీశైలనాధుడు సాక్షాత్కారంగానుదాసజనులతో మాటలాడేనుమ
శ్రీనుడు వీరవసంతుడొచ్చెనని యాసితికంఠుడు బల్కేనుమ

యుత్తపురామన్న గట్టుయెక్కి కోతిపడుదనములచటయుండేనుమా
125 కేశవునిస్మరణము జేసినవారెల్ల వాసికెక్కి వసుధనుండేరుమా
పాశుపతాస్త్రము చేతబట్టుకొని భానుమండల పతివచ్చేనుమా
126 రామధర్మజస్వామి రాజముఖిఁగూడి రాజై భువియేలవచ్చేనుమా
కాముని జనకుడు కావేటిరంగనికి కనకాభిషేకము జేసేరుమా
127 మీనమీనమని దలచినవారికి మేలైనసంపదలు గలిగేనుమా
మీనరాశిపూజ జేసినవారికి మేఘాధిపతి పదవి గలిగేనుమా
128 నీమముదప్పిన నామధారులెల్ల నీళ్ళకన్న పలచనయ్యేరుమా
సామజవరదుడు వేంచేసినప్పుడు సందుగొందులను దూరేరుమా
129 మున్నూరువారెల్లముదంతో వుండేరు మొగలాయిదొంతనం మురిగేను
పెన్నయొడ్డునయున్న చెన్నూరువారెల్ల పెనుగొండసీమకుబొయ్యేరుమ
130 గ్రామాలుపల్లెలుపట్నాలు అన్నియు గ్రహపీడనుపాడు అయ్యేనుమ
కామక్రోధములుబహుళములయ్యేను కాసుకొంకు కలహాలయ్యేనుమ
131 చంద్రవలూరు గట్టినతర్వాత చంద్రగుప్తికి వేంచేసేనుమా
ఇంద్రుడు శ్రీహరిదర్శనానికొచ్చి యిష్టార్థములుగొంచుబొయ్యేనుమ
132 బంగారుపల్లాలు వేసిన గుర్రాలు భక్తితో హరిజేరవచ్చేనుమా
మంగళమూర్తికి మంజమూరివద్ద మాన్యాలు ఏమాళ్ళుయిచ్చేనుమ
133 మార్గశిరశుద్ధ అష్టమి మొదలు మహిమీదపంటలు బుట్టేనుమ
మార్గశిరశుద్ధ పూర్ణిమలోపల మహిభారము అణగి పోయ్యేనుమ
134 నంద్యాలచిరువేళ్ళకాలమృత్యువుచేతనాశనమైప్రజలు బోయ్యేరుమ
ఇందుముఖులుతమయిరువులువిడిచేరుయిచ్ఛావిహారముగ తిరిగేరుమ
135 కొల్లాపురమువద్ద కోడుమూరుధనము కొల్లుడైబైటైయెను దీసేరుమ
కల్లమాటలుగావు పాండురాజుచేత కనకమంతబుచ్చుకొనియేరుమ
136 కమ్మన్నపనులెల్లఘడియలోనయ్యానిమ్ములహానిఇప్పుడొచ్చేనుమ
మమ్మాత్మటికిమాట నమ్మినవారిని మసందుడూ రక్షించేనుమ
137 శేషకోమల్లెల్ల జయమునవుండేరు పెద్దలుకొందరు నిలిచేరుమ
ధారుణిమీదను ధర్మాత్ములకునెల్ల దయచేసిసంపదలిచ్చేరుమ
138 కాలమృత్యువును దండించి సుందర కరుణతో సజ్జనులగాచేనుమ
నీటిలోయుదమధ్యమునన్న శ్రీహరి సింతముదయీనమయ్యేనుమ

139 శయనాధిపతియైన శ్రీ కేశవస్వామి సేవకూపిల్వ నంపేరుమ
శ్రీనివాసునకు దివ్యాభరణములు శీఘ్రముగబెట్టి పంపేరుమా
140 నూటఎనిమిది తిరుపతులలోపల మేటవేల్పుపూజ నడచేనుమ
కోటిబ్రాహ్మణులకు నిరతాన్నదానము కోరినట్లు బెట్టించేరుమ
141 వేదాద్రిజూడగ కోవెలగుంటలకు వీరధర్మజులు వచ్చేనుమ
ఆదికేశవునకు పాలవరాకాయతు అప్పుడేముంజేత గట్టేరుమా
142 నీలగిరివాసు దివ్యభూషణాలు నీరజాక్షునకు దెచ్చేరుమ
మేలయిన చెంగల్వకోటవారువచ్చి మేలువాణ్యముదెచ్చి ఇచ్చేరుమ
143 నాగశ్రీపురవాసు రామజనకునకు కానుకల్ బహుగాను దెచ్చేరుమ
మూసీరనాధునకు త్యాగశాపురివారు మాణిక్యహారాలుఇచ్చేనుమ
144 కపిలధేనువులు ఘనముగపితికేను కల్పవృక్షముఫలము లిచ్చేను
జపియించి వినప్పుడే జపశుద్ధిఅయ్యాని జాంబవామణి సంతసిల్లేనుమ
145 అడ్డకూనక మూవుపూనకనువ ఎద్దు హయమువకధరణమునకమ్మేనుమ
బిడ్డలుకోసట్టి గొడ్డ్రాడకడుపున బిడ్డలుముందర బుట్టేరుమా
146 పరాడకనమగపుహేంమీద అమ్మిని ఏకుమాడలమాడనడచెనుమ
మూడులోకములెల్ల ముగ్గమాడుచుండగ వేడుకతోస్వామివచ్చెనుమ
147 శ్రీదేవినకతము శ్రీవీరధర్మజుల సేవజేసి పూజసల్పేరుమ
భూదేవిఎప్పుడు పుండరీకాక్షునిపొగడుచు వుప్పొంగి యుండేనుమ
148 కాటలోపల మల్లిఖార్జునిసన్నిధి బంగారుసురటీల విసరేరుమ
అటనుండిబెల్లము కొండకువచ్చియు అగుకోట్లధనము దీశేరుమా
149 ఆరంగగురువులు ద్రవ్యముదీయించిఅన్నదానము బహుగజేసేరుమ
ఆనందముచేత రాచయ్యదగ్గెర అర్ధమంతయు వెళ్ళదీసేరుమా
150 ఆగరాన మూడుశంఖాలద్రవ్యము ఆర్తులకోసము దీసేరుమా
సాగరశయనుడు సరసిజముఖిగూడి సంతోషముచేత వుండేనుమా
151 వీరయోగిస్వామి విజయవిచిత్రమువిన్నవారికి భాగ్యమిచ్చేరుమ
కోరికకోరిక సఫలమయ్యేటట్లు గోవర్ధనోద్ధారు డిచ్చేనుమా
152 సిరనారాయణ పురమునుగట్టించి వెంకటాద్రివశము జేసేరుమ
ధారుణిదేవి దయతోడపాలించి మేరమర్యాదలు నడిపేరుమా
153 భూమిచతుర్దశ భువనములన్నియు భోగేంద్రశయనుడు ఏలేనుమా

సారమయిన సామవేదాథర్వణము సాంగముగనుంద నడచీనిమా
154 నారాయణాస్త్రము వారికెక్కించీని నలుషంఖలధ్వని జేసీనిమ
క్రూరమైనవారి కులములనణచీని గో బ్రాహ్మణులి రక్షించేనుమ
155 అక్షయబాణాలు పక్షివాహనుడు ఆదరమున మతునకిచ్చేనుమా
శిక్షించుమని శత్రుసమూహమెల్లను సేనాధిపతితోడ జెప్పేనుమా
156 తండ్రికొమరుడు దశరథుండై తాను ధరణితాపముచల్ల నయ్యేనుమ
తండ్రితనబిడ్డను తనయునికిచ్చీని తథ్యాంతమాట తప్పాదుమా
157 ఇందిరాపతిరూపమైన మానవుండు ఇహముఅంతా తల్లడించీనిమ
ఇందువారము శుద్ధత్రయోదశినాడు ఇష్టమంత్రముచేత బుట్టీనిమ
158 బ్రహ్మనేత్రలను వెంటబెట్టుకొని బ్రహ్మాస్త్రముదీసుకొచ్చీనిమ
బ్రాహ్మణవేషాలు అప్పుడుమార్చేరు బ్రాహ్మణాకులముద్ధరించేరుమ
159 మాణిక్యసేసిన బంగారుపతకము మామ అల్లునకు యిచ్చేనుమ
అణిముత్యములహారాలు దెప్పించి ఆదికేశవునకు ఇచ్చేరుమ
160 సంగీతలోలుడు సనకాదివంద్యుడు సాకేతపురివెడలి వచ్చీనిమ
బంగారుజలతారు వేసినకోకలు భక్తకోటులకై ఇచ్చీనిమా
161 పాపవిదూరుడు భవరోగవైద్యుడు భానుమండల నివాసుడును
శాపదగ్ధులకు శాపముకొట్టి శరణుజొచ్చినవాన్ని గాచీనిమా
162 పాంచాలకలములో భక్తులబహుగానుపరగమా వెంబడవచ్చేరుమ
కంచిఅహోబిలస్థలమందువారికి అభయమిచ్చి రక్షించేరమా
163 ఆనందగురువులకు కనకాభిషేకము అపుడుధర్మజాలు చేసేరుమా
ఆనందముచేత హాళికరామునకు అలాగినంతోడ పెట్టేరుమ
164 కడగండ్లువచ్చిని జనులకుముందర వడిగండ్లవానలు గురిసీనిమా
వడగండ్లవగ్గర ఆలమూరివద్ద బహురాజకార్యాలు అయ్యేనుమా
165 సారాముదప్పి నిస్సారాముఅయ్యాని వారవారముగింత బుట్టీనిమ
వీరవసంతుని విభవముఅయి తేను విరివిగ ప్రజవిస్థగిల్లీనుమ
166 నక్కలుపూర్వాహ్ణదినమందు కూసీనికుక్కమాతికోక బుట్టీనిమ
ముక్కలుగోసేటి వానిదేశమంత ముక్కపోయెమురికి తేచీనిమ
167 ఆదవేణిలోను గజములధ్వనిబుట్టి అత్తలకళలములు అయ్యానిమ
బాధామితో పోరుగలుగట్టెనమీద బంకాపురము గట్టుకొని[illegible]రుమా

168 ఆదవేణినుండి తరివచ్చినదండు ఆకొండకూతూర్పు నడచీనిమ
ఆదవేణీసిమ చెడిపోటగలిసీని అలాగేకందనూరమ్యోనుమా
169 గుర్రముజెప్పిన మాటలుదప్పవు గురిదాకిదృష్టాంత మయ్యేన మ
వెర్రిపంపుచేత కందనూరుసీమ యధ్వతధ్వమయి పొయ్యానిమా
170 మధ్యపానముచేత మహిమీదకొందరుగుద్దులాటకులేచి వచ్చేరుమ
గద్దెసుద్దులుజెప్పి కాలముగడిపేరు విద్యాలతో విర్రవీగేరుమా
171 కాలపరిపక్వము జనులకు ముందర కార్తీకమాసమున వచ్చీనిమ
బాలచంద్రునికాంతిగానక పొయ్యేరు భానుకాంతులు అణగిపొయ్యానిమ
172 భావులలోపల కూతలుబుట్టీని పట్నాలలోలక్ష్మివెడ్చీనిమ
కావరించినవార్ని ఖండించివేసేరు కర్మనిష్టులగార వించేరుమా
173 ఘనమైనవజ్రాలుయాగంటి మొకలుగ గాడికంబముదాక వుండీనిమ
దినకరతేజుడు తీయుంచిముందర దేవబ్రాహ్మణులకు యిచ్చేనుమా
174 రుద్రసీమలోన వున్నట్టిమనుజులు పాపవిహీనులయి పొయ్యేరుమ
రుద్రుడు కరుణానముద్రుడు భక్తుల భద్రముకోడుత గాచేనుమా
175 ముత్యాలుపగడాలు కానుకుఅన్యాని సత్యాలుభువినేల వచేరుమ
అత్యంతప్రీతితో అతివలుపురుషులు నిత్యమానందులయివుండేరుమా
176 గుగ్గిళ్ళరాయుడువచ్చేనుదుష్టుల గుండెలెల్ల ఆవటిల్లెనుమ
దగ్గరచూపులు నూచేటివారెల్ల దగ్ధపటలమై పొయ్యేరుమా
177 రుద్రుడుకాలాగ్ని రుద్రుడు శ్రీవీరభద్రునిభువిమీద కంపేరుమ
రుద్రుడై తుచ్ఛులను రుద్రభూమికంపి బుద్ధిగల్గినవార్ని విడచీనిమా
178 వీరసింహుడైన వీరధర్మజస్వామి విశ్వముపాలించ వచ్చీనిమ
దూరదృష్టిలేశమైన యెఱుంగని దుర్మార్గులను శిక్షించేరుమా
179 సద్యోఘృతపాయసాన్నం బ్రాహ్మణులకునర్వకాలములను బెట్టేరుమ
సద్యోగర్భమయిన తొమ్మిదిఘడియలకసంతానముత్పత్తిఅయ్యేనుమ
180 తొమ్మిదిఝాములకు శూద్రులవుత్పత్తిదుష్టులుదుర్గతి బొందేరుమ
తొమ్మిదిదినములకుపశువులుయీనేనుదుష్టమృగములునష్ట మయ్యేనుమ
181 గోదావరీతీర వాసులబిలిపించి గోదానములుచాల యిచ్చేరుమ
ఆదరించి దేవబ్రాహ్మణులకు అనేక అగ్రహారములు యిచ్చేరుమ
182 మకరకుంభమీనరాసులలోపల ప్రకటముగ ప్రకాశ మయ్యేరుమ

ప్రకటము జేసెంత జెప్పిన ప్రజలకు ప్రారబ్ధము తెలియనియ్యారు మా
183 సన్నవీరణాల వాయిద్యములతోడ సార్వభౌముడుత్తగ్గి వచ్చేనుమ
సన్నుతిజేశేరు సకలమయినవారు సాష్టాంగదండములు బెట్టెనుమ
184 పింగళాబముల అంగజజనకుడు మంగళస్నానము చేసేనుమ
బంగారుపువ్వుల రంగనివ్వూజించి పట్టాభిషేకము అయ్యానిమ
185 వూరువూరచ్చకొట్టాలుగాలీసి వూరవాకిటమ్మృత్యుసిలచీసిమ
మేరజనులెల్ల మన్నించుచుండీని మేరమీరినవారిని ద్రుంగేనుమ
186 ఏను తెలకాయ వానికర్మముల ఏకమయిపో మంటవెళ్ళీనిమా
జ్ఞానులకుయెల్ల గరిబోక నిలిచీని కన్నడీలు నష్ట మన్యేమా
187 దివిభువినడుమను దేవుడువున్నాడు దివిజులందరుఅందువున్నారుమ
శవసీత వోసుడు నారబ్రహ్మకొడుకు నాయమనుబల్కుచున్నాడుమ
188 నాదబిందుకళల నడిమింటనున్నాడుఆదిదేవుడుఅందు వున్నాడుమ
ఆ కేశవుడు అభయములిచ్చాను ఆనందగురుపుత్రుడొచ్చీసిమ
189 గంగ ధనసిదర్శనముజేయవచ్చేరు గంగయమునలు వుప్పొంగేనుమ
తుంగభద్రాతీరమున మా గురునుగూడి శృంగారముగనువేలేమా
190 పాతాళగంగలో నీరిసికిపొయ్యెను భూతలంబునమంటలె సీనిమా
నీతిమంతులుతరలి వచ్చేరమముందర పాతకూలుమడసి పొయ్యేరుమ
191 సంగామములోగద్దలాడినందులకు సకలమయిన దొరలువచ్చేరుమ
అంగజజనకుడైన మల్లిఖార్జునుడు అపుడుప్రజలతో మాటలాడేనుమ
192 వారధుకిసకిరి వసుధపాడయ్యాని తారలుభువిమీద రాలీసిమ
వీరాధివీరుల వెంటబెట్టుకుని వీరధర్మజస్వామివచ్చెనుమా
193 బృందావనంమహిమ భృగుమునివిన్నగనుముందరబహుపూజ ర్గేనుమ
నిందాకులమువారు నాశనమయ్యేరు నిజమయినసుజనులునిలచేరుమ
194 మందరధరుడైన భానుమండలపతి మహిమ ఎవ్వరికిని తెలియదుమ
వందేమాముతేసు సామగానప్రియుడు సాధులరక్షించ వచ్చెనుమ
195 పద్మసంభవుడు చెప్పినభవిష్యత్తు పద్మపురాణములో వున్నాదిమ
పద్మనాభునితావు పద్మసంభవువలన పద్మనాభునిపేరు వున్నాదిమా
196 గోపిదేవిని పెయ్యదూడలసహితము గోవిందుడు దెప్పించెనుమ
[illegible] ముందరభక్తులదయతోడ రక్షణ జేసేరుమా

కంగోణిసావలజాహ్నావిస్థానము శరణివీరయోగి ప్రేలెనుమ

212 దేశములోపల మహాత్ములందరు దేవికడుపులోన బుట్టిరుమ
వాసిగవణ్మతగురువును నేనేనారాయణునినామందేనానుమా

213 వరగపిరయోగి భానుమండలపతి భాగములోపల నేనేనుమ
వరవీరయోగి వాక్యాలలోపల భావమంతయును నేనేనుమ

214 భక్తులందరుమీరునిజముగవుండేటి పాలంచనుమేము వచ్చేనుమ
శక్తుడయినయట్టిభానుమండలపతిస్వామిమిముదయజూడవచ్చేరుమ

215 మధురమీనాక్షమ్మ మాడాలుఆడీని మహినిఅద్భుతాలుబుట్టినిమ
మధుసూదనస్వామిమహిమచేతభువినిమాయవాదులణగిపొయ్యేరుమ

216 పెనుగొండమచాల ద్రవ్యమున్నది పెంపుచేతను దీయించేరుమ
దనుజమర్ధనుడు అముచానగరములో ధనముఅంతా దీయించేరుమ

217 కలకానబహుగ ద్రవ్యమున్నది కమలనాభుడు దీయించీనిమ
ప్రకటామునుతాను ఆరాజ్యములో పైబడి బుచ్చుకొనేరుమ

218 పనులెల్లఘడియలో అయ్యేవి ఇమ్ముగలహో ఇపుడు వచ్చీనిమ
ముమ్మాటిగ మాటలు నమ్మితే ముకుందుడు రక్షించేనుమ

219 నెల్లూరుసీమంతనిర్మలమయ్యేనీ నిడిగల్లు నిర్ఘాతమయ్యేనిమ
కల్లూరుగలబరిగిగాభరాలయ్యేవి మొల్లముసాయిబులుమునిగేరుమ

220 రాగామువన్నెలీగట్టినమీదట సోనూరుశ్రీఘ్రమే గట్టేరుమ
నగరమువారెల్ల కులనాశనమయ్యేరు నాడేడుజగములు అయ్యేనిమ

221 భానుమండలపతి భాగ్యసంపన్నుడు భక్తులపాలింపవచ్చేనమా
భానుముక్కలయ్యబెరుకొండయ్య గుడియంతబంగారు పూయించేరుమ

222 ఫణిభట్లుగారికిపౌరోహితమిచ్చి బహుమానముతో నడిపేరుమ
ఫణిరాజుబాగ సత్రిశూలధమ కుకము భగవంతుడూవట్టుకొచ్చీనిమ

223 ఘనమునవ్రజాలయాగంటి మొదలుగ గండికంచురథము దెచ్చేరుమ
ఇనగరతేజుడుదీయించిముందగ దేవబ్రాహ్మణులకిచ్చేరుమా

224 ముండమోష..ల్లక న్నలుఅయ్యేరుముదముతో భువివిపలు నుండేరుమ
ఎండవెన్నెలరెండుసమముముగనయ్యేనియోగాలుబహుగా జేసేరుమ

225 ఆనందగురువులుఆకాశనక్షరాముడు భానునందికి జేరవచ్చీనిమ
ఆనందముచేత హార్దికేశవులను ఆశీర్వాదములు జేసేరుమ

226 రాచూరివద్దను రాజీకమయ్యాని రాజాధిరాజులు రాలేరుమ
ఆచారవృత్తితో ఆనగొందివారు యతివేషము వెళ్ళిపొయ్యేరుమా
227 నాగయ్య అనిపటి ఏడేండ్ల బాలుడు నాలుగు వేదాలు చదివీనిమ
బాగుగ బనగానిపల్లెపట్నమయ్యాని భాగ్యముతో వాల లాడినిమా
228 నెలకు మూడ్వర్షాలు గురిచితప్పక నియమంబుతో ప్రజలునడిచేరుమ
యిలలోన ధర్మము విస్తారమయ్యాని యిందిరాపతి యాజ్ఞ వడచేనిమా
229 రూకకు పుట్టెడు ధాన్యము తర్వాత పోకకు పుట్టెడు అయ్యానిమ
లోకములో అన్నముగలిగి వర్ధిల్లీని లోకులుచల్లగ నుండేరుమా
230 ఏనూరుకోట్ల భూమండలంబులు ఏకచక్రము ఏలేరుమ
భానుమండలమందు వృద్ధవయ్యేరు భానునందికి ప్రవేసించేరుమా
231 విశ్వకర్మనిర్మాణము చేసేను విజయనగరము విస్తరిల్లీనిమ
విశ్వవ్యాపకుడైన వీరధర్మజస్వామి విజయనగరమందు వుండేరుమ
232 చలంజర్లవద్ద బలములుకూడీని జగడాలులావుగ అయ్యానిమ
ఇలలోన ఇమ్మగ యువచేడియలు రెండు విసువక జయాలుపొందేరుమ
233 అగరాముగాల్చీని యాగుపారజూచీని ఆకాశము ఎర్రనయ్యానిమ
బాగుగ నగరివారు వాలాయముగను వసుధాస్థలియందు వుండేరుమ
234 కాశిలో గంగస్నానముజేసిన దోషములు బాసిపొయ్యానిమ
నాశికాగ్రమందు చూచేటివారికి కేశవునిదర్శన మయ్యానిమా
235 రామేశ్వరంవద్ద రణరంగమయ్యాని రాష్ట్రాధిపతులెల్ల మడిశేరుమ
కామక్షితల్లియు కన్నులుదెరచీని కరుణించి భక్తులగాచీనిమా
236 హా.బీరదే తనారాధించినవారి కిష్టమయిన ఐశ్వర్యములుంగలిగీనిమ
ఆ బ్రభమరాంబ ఆకలిదీరక ఆరానిసాలార గించెనుమా
237 ముక్తికాంతజనులు ముద్దుబెట్టామని ముందరావచ్చి నిలచేరుమ
ముక్తికాంతితో [illegible]ముచ్చటాడుచు ముకుందుడుముందరవుండీనిమా
238 రాయదుర్గానకు రామచిలుకవచ్చి రామధర్మజువా[illegible]స్పేనుమ
పాయకట్టువశువులవద్ద వీడేండ్లవడతికి పిల్లలుబుట్టినిమ
239 చిత్రకలునను విచిత్రాలుబుట్టిని క్షత్రియకులనాశనమయ్యానిమా
మిత్రుద్రోహులెల్ల మీనాంకమునందు మేదినిలో నష్టమయ్యేరుమా
240 గురికొని ముజ్జాద్భుచక్రముకొండలో కామరబో గుంచాడినమ
ధరణిలో కందర్పకొండగవాలలోన దామోదరుడు ప్రవేశించేనుమ

241 ఉదయాద్రిగిరిమీదసంజీవియుండిని వుత్సాహమున దెప్పించెరుమ
బదరికాశ్రమందు వుండేటిపెద్దలు భగవద్దర్శనానికొచ్చేరుమా
242 శేషాద్రినరసయ్యగారిముందర శీఘ్రమేపిలువనంపేరుమా
శేషాద్రినరసయ్యగారిపిలువక ముందేసృష్టికి చీకటయ్యానిమ
243 శ్రీకాళిమీదేసి విష్ణునామముమీద వీరధర్మజస్వామివచ్చెనుమ
విశాఖమీదాను వెళ్లినమీదట వేణునాథుడు ప్రకటమయ్యానిమ
244 కూర్మగిరివద్దగుడార్లువేయించి కొడుకుపెండ్లి అందుచేసేరుమా
కూర్మగిరినుంచిగంధర్వులువచ్చి గానము అచ్చట చేసేరుమ
245 కపిలధేనువులుఘనముగపిండిని కల్పవృక్షముఫలములిచ్చీనిమ
జపియించినప్పుడేజనశుద్ధిఅయ్యాని జాంబవతీసంతుసిలచీనిమ
246 మీనరాశిని శనిప్రవేశమైతేను మ్లేచ్ఛాలునాశనమయ్యేరుమ
పూనిదండివద్దశనియు నిలచి తేను భూభారమెల్లను అణగీనిమ
247 వృషభరాశిప్రవేశమైతేను వృద్ధులు బాలులుఅయ్యేరుమా
విపత్తులువచ్చి ఈశాన్యమునుంచి విపరీత సభలకు వినరీనిమ
248 మకరమందుగురుడుప్రవేశమైతేనుమతములన్నిగతము లయ్యానిమ
ప్రకటముచేసేను పెన్నదాటి దండు పెండ్లికొడుకు చేరవచ్చీనిమా
249 తేలుమీదగురుడుప్రవేశమయితేను దేశాలుఅన్నియుగట్టేరుమా
వాలాయముగను వర్షాలుకురిచీని వసుధలో పంటలు పండీనిమా
250 మీనమందునగురుడుప్రవేశమైతేనుభానుతేజునివన్న మయ్యానిమ
భానుమ జలపతి పాలించిజగములుభాగ్యముభక్తులకిచ్చీనిమా
251 జలములు యిరికీని జగములువణకీని జనులుచాలకష్టమయ్యేరుమ
అలవిగానిదండు అర్థముకొరకై ఆనగొందీసీమ చేరీనిమ
252 సూర్యవంశిపట్టశోభనమయ్యాని సుజనులందరు ఆటకొచ్చేరుమా
కార్యకారణాలుఘటియలోనయ్యానికలిదోషములుఅణగిపొయ్యానీమ
253 పాండురంగస్వామిప్రాకారగోపురము పసిడినీరు బోయించెరుమ
పుండరీకాక్షుడు భుజగేంద్రశయనుడుభూమిపుత్రులు పుదయించెరుమ
254 పొణిలోన పాదుకేశ్వరున సన్నిధి వీణాధ్వని వినబడియేనుమ
వాణీవిజయమున పారిజాతుడు నువాసుకేశ్వరునికొల్వుచేసీనిమ
255 ఘోరకలముతెల్ల కులనాశనమయ్యేరు కుంజర్లు సర్వాంశమయ్యేరుమ
ఆడమండలంవారు ఆర్థితో వుండేరు అరవసీమలెల్లఅరచేనుమ

271 ప్రేమప్రేమయసి పెండ్లికొడుకువద్ద పెండ్లిపెద్దలెల్లవచ్చేరుమా
సోమసిద్ధాంతముసాంపుగవిడిచీసి శుభశోభనములు అయ్యీనిమ
272 సాంద్రసింధూ వేదమార్గము చొప్పున సకలమైనవారు నడచేరుమ
చంద్రసూర్యులకు గ్రహపీడలులేక చెల్వనముతో నప్పుడుండేరుమ
273 రామేశ్వరమందురణరంగమయ్యీని రాష్ట్రాధిపతులెల్లరాలేరుమ
కామాక్షితల్లియు కన్నులదెరచీని కరుణించి భక్తులగాచీనమా
274 అంగనామణియైన ఆదిదేవినిగూడి ఆనందగుణములువచ్చేరుమ
అంగజజనకుడు ఆనందముచేత అంచనగరికి వచ్చిచేరేనుమ
275 రాయదుర్గానకు రామచిలుకవచ్చి రామధర్మజువార్త జెప్పేనుమ
పాయకట్టుపశువులవద్ద యేడేండ్ల పడతికిపిల్లలు బుట్టేనిమ
276 బిరుదైన పెనుగొండమీదను ముందర భేరీధ్వనులు వినబడియేనుమ
కరములుపదహారు గలిగిన కామిని గండికోటలోను తిరిగేనుమ
277 సురరాయునివద్దశుభవార్తజెప్పీనిమబ్బుయాయలన్నిబోయ్యీనిమ
దబ్బర వాసితలదునిమివేసేరు ధర్మాత్ములను రక్షించేరుమ
278 గురికొసమున్నాళ్ళు గుర్రముకొండలో కామారిజోగులంబాడీనిమ
ధరణిలో కందర్ప కొండగుహలలోనదా మోదమును ప్రవేశించేనుమ
279 ఉదయాద్రిమీదను సంజీవియుండిని వుత్సాహమున దెప్పించేరుమ
బదరికాశ్రమమందువుండేటిపెద్దలు భగవద్దర్శనాని కొచ్చేరుమ
280 కలిలో మేలని దలచినవారికి మేలయినసంపద గలిగేనుమ
281 కందనూరిలోన యేడుయేనులధ్వని బుట్టిగలిబిలిచాల అయ్యీనిమ
కందెనతేసి ఆత్మకూరికివచ్చి కందలూరసీమ దట్టేనుమ
282 మానినిమణిగూడి భానుమండలపతి ఏనుగపైనెక్కి వచ్చేనుమా
ఆనందముచేత అవనిలోనుజనుల అర్థితోను రక్షించేనుమా
283 మామయును అల్లుడుపొత్తునగూర్చుండి మహిలోపాయసముజార్చేరు
మామనుఅత్తను అల్లుడుయెరుగను మరుగుమాటలు మనుజులెరుగరుమ
284 అల్లునిపేరయి తెలిఆదినారాయణుడు అవనిగర్భమునందు వుండేరుమ
కలియుగముబోయి కృతయుగమువచ్చేను ఘనుడుబయలుజేరి వచ్చీనిమ
285 నందనందనుడైన నారాయణస్వామి నందిమండలాన కొచ్చీనిమ
నందాన్ల బ్రాహ్మణుల కోరవిచారించి నందనవరముప్పుడు గట్టేరుమ

శ్రీ పులికొండ పరబ్రహ్మ కవిగారిచే రచియింపబడిన,

# బ్రహ్మక్షేత్రమజిలీలు

(సరికొత్తరచన - సంపూర్ణ కాలజ్ఞానం - చక్కనికథలు)

ఆబాలగోపాలమూ చదివి ఆనందించటానికి నీతికి, మతానికి విద్యకు, వివేకానికి, తీరువుబడిద్దే ఉపన్యాసిక ఘట్టాల్ని యోగాల ఈమహా పుస్తకంద్వారా మానవ సంసారములోని సూంచిచిక్కుల గిలకొట్టి సారం తీసి పురోభివృద్ధి సరిగ్గా టక్కుంగా జన్మసాఫల్యాన్ని సాధించే చక్కని వేదాంతం గానంచేసి తెలియజెప్పి దేశికుడై తెలుగునాట జెండానెగుర వేసి తెరచాటుకుపోయి దేశకల్యాణం కోసం జీవసమాధిలో తపస్సు చేస్తున్న శ్రీవిరాట్ పోతులూరి వీరబ్రహ్మంగారి సంపూర్ణ చరిత్ర-నిజమైన చరిత్ర - నిదర్శనాలతో నిండిన చరిత్ర-అందమైన రచనలతో అద్భుతమైన ఘట్టాలతో, వెలుగులు జిమ్ముతుంది నిజమైన కాలజ్ఞానం చదువగోరితే బ్రహ్మంగారి చరిత్రలోని పరమార్థం తెలియగోరితే యీ పుస్తకమే చదువవలెను 500 పుటలు అందమైన ఫోటోలు ఆకర్షణీయమైనకూర్పు-పుస్తకంకోసం వేచియుండండి జిజ్ఞాసువులంతా.

---

వివరాలకు: రఘు బుక్ షాపు, తెనాలి.

ప్రొ॥ దుడ్డు కోటేశ్వరరావు అండ్ సన్సు,
హోల్‌సేల్ & రిటైల్ పుస్తకముల వ్యాపారం, తెనాలి.

---

ముద్రణ: రవి ప్రింటర్స్, తెనాలి.